# నేటి చైనా

## సంస్కరణల స్వభావం

ఈడ్పుగంటి నాగేశ్వర రావు



విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్, బ్యాంక్ స్ట్రీట్,
హైదరాబాద్ - 500 001. ఆం.ప్ర.

**NETI CHINA - SAMSKARANALA SWABHAVAM**
by *E. Nageswara Rao*

రాజకీయ/సామాజిక/ఆర్థిక శాస్త్రాలు

ప్రచురణ నెం. : 16

ప్రతులు : 1000

మొదటి ముద్రణ : జనవరి, 2004.

© పబ్లిషర్స్.

**ముఖపత్రం మీది పై ఫోటో:** చైనా నేషనల్ పీపుల్స్ కాంగ్రెస్ వైస్ ఛైర్మన్ జియాంగ్ జుంగువాతో శ్రీ ఈడ్పుగంటి నాగేశ్వరావు.

ఎడమ నుండి వరుసగా రెండవవారు సి.పి.సి. ఆసియా బ్యూరో డైరెక్టర్, మూడవవారు వైస్ మినిస్టర్ కోవూ, నాలుగవవారు ఈడ్పుగంటి నాగేశ్వరరావు, ఐదవవారు చైనా పార్లమెంటు వైస్ ఛైర్మన్ జియాంగ్ జుంగువా, ఆరవవారు వి.వి. రాఘవన్, ఏడవవారు హర్‌దేవ్ సింగ్ ఆర్షి, ఎనిమిదవవారు పద్మావతి, తొమ్మిది సిద్దన్న గౌడ్ పాటిల్.

**వెల: రూ.15/-**

ప్రతులకు : **విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,**
విజ్ఞాన భవన్, అబిడ్స్, హైదరాబాద్-500 001.
E-mail: visalaandhraph@yahoo.com
**విశాలాంధ్ర బుక్ హౌస్,**
(అబిడ్స్, సుల్తాన్‌బజార్), హైదరాబాద్,
విజయవాడ, విశాఖపట్నం, గుంటూరు,
తిరుపతి, హన్మకొండ, అనంతపురం, కాకినాడ.

హెచ్చరిక: ఈ పుస్తకంలో ఏ భాగాన్ని కూడా పూర్తిగా గానీ, కొంతగానీ కాపీరైట్ హోల్డరు/ప్రచురణకర్తల నుండి ముందుగా రాతమూలకంగా అనుమతి పొందకుండా ఏ రూపంగా వాడుకున్నా, కాపీరైట్ చట్టరీత్యా నేరం.

ముద్రణ: **శ్రీ కళాంజలి గ్రాఫిక్స్,** హిమాయత్‌నగర్, హైదరాబాదు.

# ఈ పుస్తకం గురించి...

చైనా కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీ ఆహ్వానంపై సి.పి.ఐ. ప్రతినిధివర్గ సభ్యుడుగా 'విశాలాంధ్ర' సంపాదకులు శ్రీ ఈడ్పుగంటి నాగేశ్వరరావు ఆగస్టు 19 నుండి 25 వరకు చైనా పర్యటించారు. నగరాలు, పట్టణాలు, గ్రామాలు, పరిశ్రమలు, పరిశోధనా సంస్థలు, వ్యవసాయ కేంద్రాలను, పలు చారిత్రక స్థలాలను సందర్శించారు. చైనా కమ్యూనిస్టు పార్టీ, ప్రతినిధులతో వివిధ స్థాయిల్లో సి.పి.ఐ. ప్రతినిధి వర్గం అనేక అంశాలపై చర్చలు జరిపింది. రచయిత పర్యాటనానుభవాలు, అధ్యయనం, పరిశీలన ఆధారంగా 'విశాలాంధ్ర'లో రాసిన వ్యాసాలు చైనాలో నేడు వస్తున్న మార్పుల స్వభావం, సంస్కరణల పంథా గురించి సక్రమ అవగాహన పెంపొందించేందుకు తోడ్పడతాయనే భావంతో, ఆ వ్యాసాలనూ ఇంకా కొన్ని అనుబంధాలనూ చేర్చి వాటిని ఒక పుస్తక రూపంలో వెలువరిస్తున్నాం.

డిసెంబరు, 2003. **ప్రకాశకులు**

# ఇందులో...





# నేటి చైనా-సంస్కరణల స్వభావం

## న్యూఢిల్లీ నుండి బీజింగ్‌కు

చైనా కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీ అంతర్జాతీయ విభాగం ఆహ్వానం మేరకు చైనాను సందర్శించే సి.పి.ఐ ప్రతినిధి వర్గంలో నా పేరు కూడా వుందని, ప్రయాణానికి సిద్ధంగా వుండమని పార్టీ నాయకత్వం తెలియచెప్పడంతో ఒకింత ఆశ్చర్యం, సంతోషం కలిగాయి. నా వరకు ఇది అనుకోని ఆహ్వానం. ఆ దేశంలోనే కాకుండా బయట ప్రపంచం పైన కూడా ప్రభావాన్ని కల్గించే పెద్ద మార్పులు అక్కడ జరుగుతున్నాయి. ఆ పరిణామాలను స్వయంగా చూసి, అర్థం చేసుకునే అవకాశం కల్గినందుకు సంతోషం.

చైనా ప్రయాణానికై 2003 ఆగస్టు 15న ఢిల్లీకి బయలుదేరే ముందు చైనాను గురించి రెండు ప్రశ్నలు నా మదిలో మెదిలాయి. ఇటీవల జపాను కమ్యూనిస్టు పార్టీ అధ్యక్షుడు ఫూజా, మార్క్స్, "కాపిటల్" గ్రంథంపై వరుసగా పరిశోధనాత్మక ప్రసంగాలు చేశారు. ఆయన చైనాను సందర్శించినపుడు బీజింగ్ విశ్వ విద్యాలయంలో సోషల్ సైన్సెస్ అకాడమీలో "లెనిన్-సోషలిస్టు మార్కెట్ ఆర్థిక వ్యవస్థ" అనే అంశంపై ఒక ముఖ్యమైన ప్రసంగం చేశారు. రెండు సమస్యలపై ఆయన ప్రసంగం కేంద్రీకృతమయింది. సోవియట్ యూనియన్ ఏర్పడిన తొలిదశలో 'యుద్ధ కమ్యూనిజం' ముగిసిన తరువాత లెనిన్ 1919-20 నుండి న్యూ ఎకనమిక్ పాలసీ (నూతన ఆర్థిక విధానం)ను ప్రవేశపెట్టారు. అది సాహసోపేత నిర్ణయం. లెనిన్ చనిపోయిన తరువాత ఆ ప్రయోగాన్ని స్టాలిన్ తుంచివేశాదని జపాను కమ్యూనిస్టు పార్టీ నాయకుడు తన ప్రసంగంలో విమర్శించారు. ఇపుడు లెనిన్ పంథాను చైనా కొనసాగిస్తూండడం సోషలిజానికి సరైన మార్గమని ఆయన అభిప్రాయపడ్డారు. రెండోది 21 వ శతాబ్దంలో సోషలిజంకు గల అవకాశాల గురించి, కాపిటలిజం పై మార్క్స్ విశ్లేషణ గురించి ఫూజా శాస్త్రీయమైన పరిశీలన చేశారు. లాభాల రేటు పడిపోతుండటంతో కాపిటలిజం సంక్షోభం కొనసాగటమేగాక తీవ్రమయ్యే సూచనలున్నాయని ఆయన పేర్కొన్నారు. కనుక క్యాపిటలిజానికి ప్రత్యామ్నాయంగా సోషలిజంను ఎంచుకోక తప్పదని ఆయన వాదన, ఇది ప్రపంచ వ్యాపిత పరిణామం. చైనా సందర్శనలో ఈ మార్పులను పరిశీలించే అవకాశం కలగవచ్చు అనేది ఆశ.

ఆగస్టు 16 ఉదయం న్యూఢిల్లీ అజయ్ భవన్‌కు చేరుకోగానే మొదట కలిసిన వ్యక్తి పార్టీ ప్రధాన కార్యదర్శి కామ్రేడ్ బర్ధన్. "మంచిది! నీవు వచ్చావు, ఇప్పుడే 10

గంటలకు ఈ ప్రధాన రహదారికి ఇంద్రజిత్ గుప్తా నామకరణోత్సవ సభ జరగనుంది" అని ఆహ్వానం పలికారు.

అజయ్‌భవన్, బాల్‌భవన్, ఇంకా ఇతర ముఖ్యమైన కార్యాలయాలు, పార్కు వున్న విశాలమైన మార్గాన్ని కోట్లామార్గ్‌గా పిలుస్తారు. ఢిల్లీ ముఖ్యమంత్రి షీలాదీక్షిత్‌కు కొంత కాలం క్రితం బర్ధన్ ఒక లేఖ రాస్తూ, భారతదేశ కార్మికవర్గానికి, పార్లమెంటరీ వ్యవస్థకు అత్యున్నత సేవలు అందచేసిన కామ్రేడ్ ఇంద్రజిత్ గుప్తా పేరును ఆ మార్గానికి పెట్టవలసిందిగా కోరారు. ముఖ్యమంత్రి వెంటనే స్పందించి "కామ్రేడ్ ఇంద్రజిత్ గుప్తా మార్గ్" గా దానిని తిరిగి నామకరణం చేశారు. ఆ సభలో ఆమె ముఖ్య అతిథి. స్థానిక కాంగ్రెస్ కార్పొరేటర్ ఆ సభలోనే మరో సూచన చేశారు. పార్క్‌లో ఇంద్రజిత్ గుప్తా విగ్రహాన్ని ఏర్పాటు చేయాలనే ఆ సూచనతో పలువురు ఏకీభవించారు. స్థానిక కాంగ్రెస్ ఎం.ఎల్.ఎ., సి.పి.ఎం., సి.పి.ఐ. ప్రముఖులు ఆ సభలో పాల్గొన్నారు.

ఆగస్టు 17 సాయంత్రం ప్రతినిధివర్గ సభ్యులకు న్యూఢిల్లీలోని చైనా కాన్సులేట్ లా మెరిడన్ హోటల్ విందు ఏర్పాటు చేశారు. చైనా వంటకాలు రుచి చూడాలంటూ ఆయన సంభాషణను ప్రారంభించారు. భారత-చైనా సంబంధాలు, స్నేహాలు, చైనా విదేశాంగవిధానం, వాజ్‌పేయి చైనా పర్యటన అంశాలపై సంభాషణ సాగిన తరువాత ఆంధ్రప్రదేశ్‌లోని రాజకీయ పరిణామాలు, ప్రాంతీయ పార్టీల ఆవిర్భావం, కర్నాటకతో నదీజలాల సమస్యలను ఆయనే లేవనెత్తి తెలుసుకోవటానికి ప్రయత్నించటం ఆశ్చర్యం కల్గించింది. ఆయనలో నిశిత పరిశీలనా దృష్టి వుంది. చైనాలో సి.పి.ఐ ప్రతినిధివర్గం కార్యక్రమాన్ని స్థూలంగా ఆయన వివరించిన అనంతరం మాకు వీడ్కోలు చెప్పారు.

18వ తేదీ బీజింగ్‌కు బయలుదేరేముందు, సాయంత్రం పార్టీ ప్రధాన కార్యదర్శి కామ్రేడ్ బర్ధన్, పార్టీ అంతర్జాతీయ విభాగం బాధ్యతను చూస్తున్న సెక్రటేరియట్ సభ్యులతో ప్రతినిధివర్గం సమావేశం జరిగింది. గత నవంబరులో చైనా కమ్యూనిస్టు పార్టీ 16వ మహాసభ జరిగిన అనంతరం చైనాను సందర్శించుతున్న మొదటి సి.పి.ఐ ప్రతినిధివర్గం ఇది. కొన్నిముఖ్యమైన అంశాలను ఆయన మా దృష్టికి తెచ్చారు. కామ్రేడ్ పల్లవ్‌సేన్ గుప్తా ఈ కార్యక్రమాలన్నింటిని సమన్వయ పూర్వకంగా నిర్వహించారు. సి.పి.ఐ సెక్రటేరియట్‌లో వయస్సు రీత్యా అందరిలోకి పెద్ద వాడైన కామ్రేడ్ వి.వి. రాఘవన్ ప్రతినిధి వర్గానికి నాయకత్వం వహించారు. గతంలో ఆయన కేరళలో మంత్రిగా పనిచేశారు. ప్రస్తుతం రాజ్యసభ సభ్యులు. మిగిలిన సభ్యులు సిద్దన్న గౌడ్ పాటిల్, హరదేవ్ సింగ్ ఆర్షి, పద్మావతి, ఈడ్పుగంటి నాగేశ్వరరావు.

19 వ తేదీ ఉదయం చైనా ఈస్టరన్ ట్రావెల్స్, ఎమ్.యు.+564 విమానంలో 6 గంటల ప్రయాణం అనంతరం మధ్యాహ్నం బీజింగ్‌లో దిగాం. న్యూఢిల్లీకి, బీజింగ్‌కు కాలమానంలో రెండున్నర గంటలు తేడా వుంది. విమానాశ్రయంలో చైనా

కమ్యూనిస్టు పార్టీ అంతర్జాతీయ విభాగం అధికారులు స్వాగతం పలికారు. బీజింగ్ వాతావరణం మన హైద్రాబాద్‌ను పోలి వుంది.

విమానాశ్రయం నుండి ప్రతినిధివర్గం బసచేసే హోటల్‌కు వెళ్ళే 40 నిముషాల కారు ప్రయాణంలో ఒక ప్రధాన మార్గంలో జనజీవన సరళిని చూసే మొదటి అవకాశం కలిగింది. నల్లరంగు గల చిన్న కారులు బారులు తీరినట్లు సాగిపోతున్నాయి. వీటిలో అత్యధిక భాగం మారుతి సుజికి ఎస్టీమ్ మోడల్‌లో వున్నాయి. రెండవ లైనులో సైకిల్ ప్రయాణీకులు వరుసలుగా సైకిళ్ళు తొక్కుకుంటూ వెళ్ళిపోతున్నారు. మూడవ లైనులో పాదచారులు (సంఖ్య పలుచగా వుంది) ఫ్రీగా నడుస్తూ జట్లు జట్లుగా విడివిడిగా వెళుతున్నారు. ఎక్కడా ఆటో రిక్షా కానరాలేదు. సైకిల్ రిక్షా లేదు. బైసికిల్‌పై ఇద్దరు ప్రయాణీకులను చూడలేదు. జనం కదలికలో, నడకలో, నడవడిలో ఒక రిథమ్ కన్పించింది.

సి.పి.సి. అంతర్జాతీయ విభాగం నడుపుతున్న వాన్‌షో హోటల్‌లో బస. అది ఆధునిక సౌకర్యాలు గల పెద్ద హోటల్. వీధులలో సైన్ బోర్డులు, చైనీస్, ఇంగ్లీషు భాషల్లో వున్నాయి. హోటల్‌లో కూడా అదే నమూనా. చైనీస్ భాష తరువాత ఇంగ్లీషు పెద్దప్రాచుర్యంలో వున్నట్లు కన్పించింది. చైనా డైలీ దినపత్రిక ఇంగ్లీషు ఎడిషన్ అక్కడ లభ్యమవుతున్నది. ఆ పత్రికలో ఆకర్షణీయమైన మార్పులు చోటు చేసుకున్నాయి. టి.వి.లో బి.బి.సి., సి.ఎన్.ఎన్. ఛానల్స్ కూడా ప్రసార మవుతున్నాయి. హోటల్‌లో గదులు, మీటింగ్ హాల్స్ రకరకాల పెయింటింగ్స్, కళా ఖండాలు, చారిత్రక స్థలాల ఫోటోలతో అలకంరించబడి వున్నాయి. హోటల్ సిబ్బంది చైనీస్ ఫ్యాషన్ దుస్తులలో స్మార్ట్‌గా వున్నారు. చైనా లక్షణాలతో కూడిన ఆధునికత ఎల్లెడలా సాక్షాత్కార మయింది.

ఆ సాయంత్రం సి.పి.సి కేంద్ర కమిటీ అంతర్జాతీయ విభాగం వైస్ మినిష్టర్ కామ్రేడ్ కైవూతో జరిగిన సమావేశంలో పలు అంశాలపై ఆసక్తి కరమైన చర్చలు సాగాయి. భారత కమ్యూనిస్టు పార్టీ సుదీర్ఘ చరిత్ర, దాని పాత్రను ఆయన ఉగ్గడించారు. చైనా అనుభవాలు, సోవియట్ కమ్యూనిస్టు పార్టీ అనుభవాలను గుణపాఠాలుగా స్వీకరించి చైనాలో సంస్కరణలకు, మార్పులకు శ్రీకారం చుట్టామని వివరించారు. అభివృద్ధి చెందిన దేశాలతో సుదీర్ఘకాలం సహజీవనం కొనసాగించుతూనే చైనాలో సమృద్ధికరమైన సోషలిజంను నిర్మించే ప్రయత్నంలో వారున్నారు. ప్రస్తుతం ప్రపంచంలో చైనా, వియత్నాం, లావోస్, క్యూబా, కొరియా మాత్రమే సోషలిస్టు దేశాలుగా అభివృద్ధి చెందుతున్నాయి. 21 వ శతాబ్దంలో ఆయా దేశాలలో కమ్యూనిస్టు పార్టీల కార్యకలాపాలు, విజయాలపై సోషలిజం అవకాశాలు ఆధారపడి వున్నాయి. ప్రస్తుత ప్రపంచంలో ఆధిపత్యవాదం, ఆధిపత్య రాజకీయాలు బలంగా వున్నాయి. చైనాలో సోషలిజం నిర్మాణం తొలిదశను పూర్తిచేయటం తక్షణ లక్ష్యం. సంపదను వృద్ధిచేయటం ద్వారా ప్రజల అవసరాలను తీర్చగలం. చైనా కమ్యూనిస్టు పార్టీ నూతన నాయకత్వం పూర్తివిశ్వాసంతో ముందుకు పోతున్నది.

25 మంది పొలిట్ బ్యూరో సభ్యులలో 15 మంది కొత్తవారు. 9 మంది స్టాండింగ్ కమిటీ సభ్యులలో ఒక్కరు మినహా అందరూ కొత్తవారేనని చైనా ప్రతినిధివర్గం వివరణ యిచ్చింది.

రాత్రి విందు అనంతరం $8\frac{1}{2}$ గంటలకు మొదటిసారి, చివరిసారిగా కొంతమంది మిత్రులం బీజింగ్ వీధులలో కాలినడకన కొన్ని వీధులు తిరిగాం. షాపులు చూశాం. స్వదేశీ, విదేశీ తయారీ ఎలక్ట్రానిక్ వస్తువులు, రకరకాల డిజైన్లలో దుస్తులు, సిగరెట్లు, మద్యం, పాదరక్షలు, లభ్యమవుతున్నాయి. కొన్ని షాపులు మూసివేస్తున్నారు. హోటళ్ళు సగం టేబుల్స్‌వరకు నిండి వున్నాయి. వీధులలో జనం రద్దీ తగ్గింది. కాని వాహనాలరద్దీ ఎక్కువగానే వుంది. విద్యుత్ కాంతులతో రాత్రివేళ బీజింగ్ ప్రధాన వీధులన్నీ దేదీప్యమానంగా, చెట్లకు అలంకరించిన రంగు రంగుల విద్యుత్ బల్బులతో ఇంద్రధనుస్సుగా వెలుగొందుతున్నాయి.

4 లైన్ల వీధులలో చెట్లు ఇరువైపుల, మధ్యలోనూ మూడు వరుసలు వున్నాయి. రెండు లైన్ల వీధులలో అవి ఇరువైపుల వున్నాయి. పరిసరాలు పరిశుభ్రంగా వున్నాయి. గోడలపై రాతలు లేవు. బిల్‌బోర్డులు ప్రత్యేక అలంకరణతో ఆకర్షణీయంగా అమర్చబడివున్నాయి. పర్యావరణం పై చైనా ప్రత్యేక శ్రద్ధ చూపుతున్నది.



# సోషలిజం ప్రస్థానం

## గ్రేట్ హాల్ ఆఫ్ ది పీపుల్ - జాతుల ఐక్యతకు ప్రతీక

**20వ తేదీ ఉదయం** వాన్‌షూ హోటల్ నుండి ప్రాచీన నగరం (ఫర్ బిడెన్ సిటీ)కు బయలుదేరాం. రోడ్డు పొడవునా ఆధునిక బహుళ అంతస్థుల భవనాలు, బ్యాంకు, ఇన్సూరెన్స్ కార్యాలయాలు, ప్లాజా డిపార్టుమెంటు స్టోర్స్ దర్శనమిచ్చాయి. ప్రసిద్ధ టియాన్‌న్మన్ స్క్వేర్‌కు ముఖద్వారం వద్ద రెండు పాత కట్టడాలు నాటి చరిత్రకు సాక్షీభూతంగా అలాగే భద్రపరిచారు. అందులో ఒకటి మావో జె డుంగ్ స్మారక భవనం కావడం ఒక ప్రత్యేక ఆకర్షణ. స్క్వేర్ మధ్యలో మృతవీరుల స్థూపం సూదంటురాయిలా ఆకర్షిస్తున్నది. చుట్టూ బ్రహ్మాండమైన విశాల మైదానం. అంతటా జనసందోహం. కనీసం 6, 7 వేలమంది సందర్శకులు ఆ సమయంలో వుంటారు. ఒకవైపు గ్రేట్ హాల్ ఆఫ్ ది పీపుల్. దానికి ఎదురుగా రివల్యూషనరీ మ్యూజియం. మరోవైపు మావో మసోలియం. దేశం యావత్తు సూక్ష్మరూపంలో అక్కడ దర్శనమిస్తున్నదా అనిపించింది. వివిధ ప్రాంతాలనుండి ప్రతిరోజూ 30 వేలమంది దీనిని సందర్శిస్తారని చెప్పారు.

1972లో మొదటిసారిగా మాస్కో వెళ్ళినపుడు రెండవరోజున ప్రొఫెసర్ రనడే రెడ్‌స్క్వేర్‌కు ఆ సాయంత్రం తీసుకువెళ్ళాడు. అదొక గంభీర వాతావరణం., ఎదురుగా లెనిన్ మసోలియం. దానిని ఆనుకుని వున్న క్రెమ్లిన్ గోడ, వరుసగా స్వెర్డలోవ్, స్టాలిన్, ఇతర నాయకుల సమాధులు, గోడ లోపల ఎత్తైన క్రెమ్లిన్ భవనాలు, మరోవైపు రివల్యూషనరీ మ్యూజియం. ఇంకో వైపు ప్రాచీన అద్భుత కళాఖండం చర్చి. అదొక థ్రిల్. క్రెమ్లిన్ స్క్వేర్ చూడగానే మూడవ ఇంటర్నేషనల్ నాయకులు 1920 దశకంలో సాయంత్రం సమయంలో గ్యాలరీలపై కూర్చుని ప్రపంచవిప్లవ గమనం పై జరుపుకున్న వాడి, వేడి చర్చలు జ్ఞప్తికివచ్చాయి.

ఇక్కడ టియాన్‌న్మన్ స్క్వేర్‌లో ప్రవేశించగానే కన్పించింది జనం కదలిక. ఆకాశమంత మైదానం అంతా జనమయం. చైనా జాతి బలం వారి సమీకరణలోనే వుందని అన్పించింది. ముందుగా మావో భౌతికకాయాన్ని సందర్శించాం. సోఫాలో ఆశీనుడై వున్న మావో పాలరాతి విగ్రహం. దాని అడుగు భాగాన పేటికలో శాశ్వత నిద్రలో వున్న మావో భౌతికకాయం. అదొక గొప్ప అనుభూతి. జనం బారులుతీరి శ్రద్ధాంజలి ఘటిస్తున్నారు. బీజింగ్‌లో దిగిన తరువాత మొదటిసారిగా ఒక నాయకుడు చిత్రపటాన్ని కూడా అక్కడే చూశాం. అది మావో చిత్రపటం. దానిని మ్యూజియంపైన అమర్చారు. మావోకు శ్రద్ధాంజలి అనంతరం వెనుకభాగంనుండి బయటకు వెళ్ళే మార్గంలో రకరకాల సావనీర్లు అమ్మకానికి సిద్ధంగా వున్నాయి.

మావో, లిషావోచీ, చూ టే, చౌ ఎన్ లై బొమ్మలు ముద్రించిన నాణాలు, మెడల్స్, చెక్కడాలు కన్పించాయి. చైనా విప్లవానికి నేతృత్వం వహించిన మహానాయకులను నేటి పార్టీ నాయకత్వం ప్రజలు తగు రీతిలో గౌరవిస్తున్నారు. స్మరించుకుంటున్నారు. పార్టీ చరిత్ర, నాయకుల పాత్రపై కొంతకాలంగా పునర్ మూల్యాంకనం సాగుతున్నది. చైనా కమ్యూనిస్టుపార్టీ ప్రధాన కార్యదర్శి హు జింటావో, ఇతర అగ్రనాయకుల ఫొటోలు మేం తిరిగిన ప్రదేశాలలో ఎక్కడా కన్పించలేదు.

గ్రేట్ హాల్ ఆఫ్ ది పీపుల్ చైనా జాతికి ప్రతీకగా నిలిచింది. అది ఐదు అంతస్థులు గల విశాలమైన భవన సముదాయం. పదివేలమంది సమావేశమయ్యే గ్రేట్ హాల్. చైనా పార్లమెంటు సమావేశాలు, చైనా కమ్యూనిస్టుపార్టీ మహాసభలు, ఇతర ముఖ్యమైన ఉత్సవాలు, సభలు అక్కడే జరుగుతాయి. ఐదువేలమందికి ఒకేసారి అధికార స్థాయిలో విందు ఏర్పాటుకు మరొక ప్రత్యేక హాలు. ప్రతిఒక్క రాష్ట్రానికి వారివారి సంస్కృతిని ప్రతిబింబించే రీతిలో తీర్చిదిద్దిన, కళాత్మక సౌందర్యం ఉట్టిపడే ప్రత్యేక మందిరాలు, వివిధ దేశాధినేతలు, సోదర కమ్యూనిస్టు ప్రతినిధివర్గాలతో సమావేశమయ్యేందుకు విశాలమైన హాలులు... అది ఒక అపురూప కట్టడం. 1950 దశకంలో 9 నెలల్లో ఆ బ్రహ్మాండమైన నిర్మాణం పూర్తయింది. ప్రతి చైనీయుడు ఆ భవనాన్ని చూసి గర్వపడతాడు. అది చైనా భిన్న జాతుల ఐక్యతకు చిహ్నం. యావత్ ప్రాంగణం ఒక మహాశక్తివలె గోచరించింది. ఆ ప్రజాశక్తిని ఎవరూ జయించలేరు!

ఆ సాయంత్రం రెండు ముఖ్యమైన సమాలోచనలు జరిగాయి. మొదటిది ఆసక్తికరమైనది, విజ్ఞానదాయకమైనది. చైనా కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ ఆసియా బ్యూరోతో సుదీర్ఘ చర్చలు జరిగాయి. డబ్ల్యు.టి.ఓ (ప్రపంచవాణిజ్యసంస్థ)లో చేరటానికి చైనా 14 సంవత్సరాలుగా ప్రయత్నిస్తున్నది. ఆర్థిక ప్రపంచీకరణ నేటి పరిణామం. ఏ దేశం దానినుండి తప్పించుకోలేదు. డబ్ల్యు.టి.ఓ.లో చేరితే వ్యవసాయం, ద్రవ్యరంగం తీవ్ర ఒడిదుడుకులకు లోనవుతాయని చైనాకు అది నష్టమని చాలామంది భావించారు. 2002 సంవత్సరంలో డబ్ల్యు.టి.ఓలో చైనా సభ్యత్వం పొందింది. చాలామంది అంచనాలకు భిన్నంగా చైనా వ్యవసాయ ఎగుమతులు దిగుమతులను మించి పెరిగాయి. వ్యవసాయ ఉత్పత్తులు మిగులు గణనీయంగా పెరిగాయి. కూరగాయలు, ఫలాలు, పుష్పాలు జపాను, ఆస్ట్రేలియా, అమెరికా ఇతర దేశాలకు చైనా ఎగుమతి చేస్తున్నది.

ఇది పరివర్తన దశ. రాబోయే 15-20 సంవత్సరాలకాలం (2020) కీలకమైనది. చైనా ఆర్థిక వ్యవస్థను మార్కెట్ ఎకానమిగా పరిగణించమని పశ్చిమ దేశాలు వాదిస్తూ వచ్చాయి. చైనా వస్తువులపై అధిక సుంకం విధించారు. దిగుమతులను నిషేధించారు. డబ్ల్యు.టి.ఓ.లో ప్రతికూల అంశాలు ఉన్నాయి. ప్రతికూల ఫలితాలు కొన్ని ఉన్నాయి. ఆ సమస్యలను ఎదుర్కొనగలమని చైనా నాయకత్వం భావిస్తున్నది.

వరల్డ్ సోషల్ ఫోరమ్, దానిలో ఎన్.జి.ఓ.ల (ప్రభుత్వేతర సంస్థలు) పాత్రపై చైనా అవగాహనలో సానుకూల మార్పు ఉందని చైనా ప్రతినిధి వర్గం తెలిపింది. గతంలో అనుసరించిన వైఖరి అంతా సరియైనది కాదు. చైనా పార్టీ ఆసియా బ్యూరో సభ్యులకు భారత్‌ను గురించిన పరిజ్ఞానం విస్తారంగా ఉంది. హైదరాబాద్, విజయవాడ ప్రస్తావనలు వచ్చాయి. వారంతా యువకులు, విద్యావంతులు.

ఆ సాయంత్రం గ్రేట్ హాల్ ఆఫ్ ది పీపుల్, హైనాన్ హాలులో నేషనల్ పీపుల్స్ కాంగ్రెస్ వైస్ ఛైర్మన్ కామ్రేడ్ జియాంగ్ జంగువాతో సమావేశం. ఆయన పెజెంట్స్ అండ్ వర్కర్స్ పార్టీ అధ్యక్షుడు, శాస్త్రవేత్త. ముంబాయిలో కొంతకాలం ఉన్నాడు. చైనా కమ్యూనిస్టుపార్టీ నాయకత్వాన కొనసాగుతున్న బహుళపక్ష ప్రభుత్వంలో ఆ పార్టీ భాగస్వామి. పేరుకు పెజెంట్స్ అండ్ వర్కర్స్ పార్టీగా పిలువబడుతున్నప్పటికీ ఆ పార్టీ సభ్యులు ప్రధానంగా డాక్టర్లు, శాస్త్రవేత్తలు.

భారత్, చైనా రెండు ప్రాచీన దేశాలు. వాటి చరిత్ర, సంస్కృతులు, ప్రత్యేకతలు, సామాన్య అంశాలు మొదలైన వాటిపై సంభాషణ సాగిన అనంతరం, చైనా గ్రామసీమల్లో వస్తున్న ప్రజాస్వామ్యయుత సంస్కరణపై చర్చ మరలింది. అనంతరం ఆయన సి.పి.ఐ. ప్రతినిధి వర్గానికి అక్కడే విందు ఏర్పాటు చేశారు. రెండు రోజుల క్రితం ఆ హాలుకు పక్కనే మరొక మందిరంలో రుమేనియా అధ్యక్షునికి చైనా అధ్యక్షుడు హు జింటావో విందు ఏర్పాటు చేశారు. ఆ సౌధం లోపల శిల్పం, చిత్రకళ, అలంకరణ ఏర్పాట్లు మా మనోఫలకాలపై చెరగని ముద్రవేశాయి.



# జనజీవన శైలి

ఆగస్టు 21వ తేదీ ఉదయం వ్యాన్ షూ హోటల్ నుండి బీజింగ్ డౌన్‌టౌన్ ద్వారా నగరానికి వెలుపల ఉన్న వ్యవసాయక - పారిశ్రామిక కార్పొరేషన్‌కు బయలుదేరాం. బీజింగ్ విశ్వవిద్యాలయం, శాస్త్ర, సాంకేతిక విజ్ఞాన సంస్థలు, ఓవర్‌సీస్ బ్యాంకుల కార్యాలయాలు, వ్యవసాయ రుణాల బ్యాంకులు, విదేశీ సంయుక్త మండల కార్యాలయాలు, ఆరులైన్ల రోడ్డులు, ఫ్లై ఓవర్స్, ప్లాజా, మాసాజ్ సెలూన్లు, బ్యూటీ పార్లర్స్, సాంస్కృతిక మందిరాలు, ఉద్యోగులు, మేధావులు నివసించే 15, 16 అంతస్థుల భవన సముదాయాలు, ఆధునిక విజ్ఞాన సర్వస్వాన్ని ప్రతిబింబించే రీతిలో ఆ ప్రాంతం ప్రకాశిస్తున్నది.

మూడురోజులుగా బీజింగ్‌ను అటూ, ఇటూ కారులో కలయ తిరుగుతున్నాం. గెడ్డాలు, జులపాలు పెంచినవారు తారసిల్లలేదు. మీసాలు పెంచిన వారు బహు కొద్దిమంది. ముఖాలు తేటగా, తెల్లగా, నున్నగా ఉన్నాయి. నమ్రతాభావం, మంచి మర్యాద ప్రస్ఫుటంగా కానవచ్చాయి. చైనా ప్రాచీన తత్వవేత్త కన్‌ఫ్యూసియస్ రూపొందించిన మార్గదర్శక ప్రవర్తనా నియమావళి ప్రభావం చైనీయుల నైతిక వర్తనంలో గాఢంగా అభివ్యక్తమవుతున్నది. సభ్యత, సంస్కారం సహజ లక్షణాలుగా గోచరిస్తున్నాయి. డ్రెస్ (వేషధారణ) సింపుల్‌గా, నీట్‌గా ఉన్నది. ఆగస్టు మాసం వాతావరణం రీత్యా అత్యంత అనుకూలమైనది. వారికది వేసవికాలం. హాఫ్‌హాండ్‌స్లాక్ షర్టు, పాంటు అన్ని తరాలవారు ధరించిన డ్రెస్. బాగీ ఫాంటులు, బిగుతు పాంటులు అరుదు. పాంటు, షర్టు, సూట్‌కట్ హుందాగాను, ఫ్యాషన్‌గా ఉన్నాయి. ఇదే దృశ్యం ఆ తరువాత కూడా ఇతర నగరాలకు గ్రామాలకు వెళ్ళినపుడు సర్వసాధారణంగా కన్పించింది. స్టార్ హోటల్‌లో విడిదిచేసిన వారు, రోడ్డు మీద కాలినడకన తిరిగేవారు డ్రెస్‌కట్ ఒకే రీతిలో ఉండటం విశేషం. ఇది ప్రధానంగా పురుషులకు సంబంధించినది. బీజింగ్‌లో 20 లక్షల కార్లు తిరుగుతున్నాయి. ట్రాఫిక్ సమస్యను గురించి చర్చలు సాగుతున్నాయి. మెట్రోలైన్లను అభివృద్ధి పరుస్తున్నారు. ప్రైవేటు కార్ల రద్దీపై విమర్శ పెరుగుతున్నది.

చూస్తూండగానే గ్లోరియస్ అగ్రో-ఇండస్ట్రియల్ ఫ్యాక్టరీ వచ్చింది. పెద్ద విస్తీర్ణంలో ఉన్నది. గ్రీన్‌హౌస్‌లో వివిధ రకాల మొక్కలు, పుష్పాలు, ఫలాలు, తివాసీలు పరచినట్టు ఉన్నాయి. టిష్యు కల్చర్, జెనిటిక్ ఇంజనీరింగ్, బయో టెక్నాలజీలో అద్భుత ఫలితాలను ఈ ఫ్యాక్టరీ సాధించింది. ఒక పుట్టగొడుగును మాచేతికి అందించారు. అది గట్టిగా ఉన్నది. దానిని కొడితే రాయిలాగా మోగుతున్నది. వేడినీళ్ళలో దానిని ముంచితే కొంత సేపటికి మెత్తబడుతుందట.

మేలు జాతి గిత్తలు, దూడలను కెనడా ఇతర దేశాలనుండి దిగుమతి చేసుకొని కొత్త సంకరజాతి పశుసంపదను అభివృద్ధి పరుచుకుంటున్నారు. ఫ్యాక్టరీలో షేర్ హోల్డర్లుగా ఉద్యోగులు, రైతులు, ఇతర సంస్థలు ఉన్నట్టు చెప్పారు. పక్కనే కూరగాయల మార్కెట్ ఉన్నది. అమ్మకాలు, కొనుగోళ్ళు జోరుగా సాగుతున్నాయి.

సాయంత్రం మరో దిక్కుగా 70 కిలో మీటర్లు ప్రయాణంచేసి బ-దాలింగ్ చేరుకుని ప్రపంచ ప్రసిద్ధి చెందిన గ్రేట్ వాల్‌ను అధిరోహించాం. అంతా పర్వత కనుమలు. పర్వత శిఖరాలపై కోటగోడలు లేచినట్టు ఉన్నాయి. 7 అశ్వాలు, లేదా 10 మంది సైనికులు గోడపై అడ్డంగా కదంతొక్కవచ్చు. శత్రువులనుండి దేశాన్ని కాపాడేందుకు నిర్మించిన దుర్భేద్యమైన గోడ. వందల కిలోమీటర్ల దూరం సందేశాలు వివిధ రూపాలలో పంపటానికి అనుగుణ్యంగా నిర్మాణం జరిగింది. 4700 మైళ్ళ పొడవున అది నిర్మించబడింది. చైనీయులు, విదేశీయులు తిరణాలగా దానిని సందర్శిస్తున్నారు. చరిత్ర అద్భుత సృష్టిలో ఇది ఒకటి.

ఆ రాత్రి అక్రోబటిక్ షో, విన్యాసాలు గగుర్పాటు కల్గించేవిగా ఉన్నాయి. సంకేతాలు, సంజ్ఞలు, రణోత్సవ, విజయోత్సవ ధ్వనులు, పతాకాల కెరటాలు ప్రేక్షకులను ఉత్తేజపూరితులను చేశాయి. 2008 ఒలంపిక్స్‌కు బీజింగ్ సిద్ధమవుతున్నది.

ఆగస్టు 22 ఉదయం బీజింగ్‌లో పెద్ద డిపార్ట్‌మెంట్ స్టోర్‌ను చూశాం. ప్రత్యేక ఆకర్షణ ఎలక్ట్రానిక్ వస్తువులు, సెల్‌ఫోన్లు, స్వదేశీ తయారీ, విదేశాల నుండి దిగుమతి చేసుకున్నవి కూడా ప్రదర్శనలో వున్నాయి. చైనా మార్కెట్‌లో నేడు అత్యంత డిమాండ్‌లో వున్నది సెల్‌ఫోన్లు. వాటి వినియోగదార్ల సంఖ్య అనూహ్యంగా పెరిగిపోతున్నది. మహిళలు ముఖ్యంగా యువతుల ఫ్యాషన్‌బాగ్‌లో అది అంతర్భాగంగా మారింది. యువతీ, యువకుల హెయిర్‌కట్ అందంగా, నీట్‌గా కన్పించాయి. యూరప్ వీధులలో, పార్క్‌లలో, థియేటర్లలో కన్పించే యువతీ, యువకుల జంటలు, గుంపులు, రొమాన్స్, బీరు తాగడం, సిగరెట్లు తాగడం వంటి దృశ్యాలు కనపడలేదు.

ఆ మధ్యాహ్నం 500 కిలోమీటర్ల దూరంలో వున్న హెబే రాష్ట్రానికి డబుల్ డెకర్ రైలులో ప్రయాణం. దాని రాజధాని నగరం షి జియాహువాంగ్. చారిత్రాత్మక విముక్తి పోరాట కేంద్రాలకు, ప్రకృతి రమణీయ దృశ్యాలకు, ఆధునిక వ్యవసాయ పద్ధతులకు ఆ రాష్ట్రం ప్రసిద్ధి చెందింది.

బీజింగ్ రైల్వేస్టేషన్ భవనం ఆకృతి చైనా ప్రాచీన సంస్కృతిని, వాస్తుశిల్పాన్ని ప్రతిబింబిస్తున్నది. ట్రాఫిక్ రద్దీని నియంత్రణ చేసేందుకు ప్రాంగణం అంతా ఫ్లైఓవర్స్‌తో పునర్నిర్మాణం చేశారు. విమానాశ్రయం, రైల్వేజంక్షన్లలో ఎక్కడా కూలీలు వుండరు. ట్రాలీలో సామాన్లు సర్దుకుని స్వయంగా తీసుకువెళ్ళాలి. రైలులో స్పెషల్ క్లాసు, ఆర్డనరీక్లాసులు వున్నాయి. సరిగ్గా మధ్యాహ్నం 2 గం॥28 ని॥లకు (షెడ్యూల్ టైమ్) బీజింగ్ నుండి బయలుదేరిన రైలులో సాయంత్రం గం॥5.08ని॥లకు షి జియా హువాంగ్‌కు చేరుకున్నాం.

రైల్వే స్టేషన్లలలో అరుపులు, కేకలు, వెండర్స్ వెంబడించడం, ప్రచారహోరు ఎక్కడా వినిపించలేదు. వస్తువుల అమ్మకాలు సాగుతున్నాయి. షాప్స్ వున్నాయి. రోడ్డుమీద, స్టేషన్లలో, రైలులో ఉమ్ము ఊయడం, ముక్కు చీదడం వంటి అలవాట్లు ఎక్కడా చూడలేదు. పరిసరాల పరిశుభ్రత, మానవ సంబంధాలలో సభ్యత, నియమబద్ధమైన జీవనశైలి వారి జీవన విధానంలో అంతర్భాగంగా కనిపించాయి.

500 కిలోమీటర్ల రైలు ప్రయాణంలో రైల్వేలైను అటు, ఇటు గజం స్థలం బీడుగా కనిపించలేదు. ఏదో ఒక మొక్క పచ్చదనం పరివ్యాప్తమయ్యాయి. గ్రామసీమలు రూపురేఖలు మారుతున్నాయి. పట్టణ వాతావరణం వ్యాపిస్తున్నది. ఇళ్ళ నిర్మాణం, ముఖ్యంగా వేరు వేరు ప్రత్యేక ఇళ్ల సంస్కృతి పెరుగుతున్నది. మొక్కజొన్న, గోధుమపంట పొలాలు ఎక్కువగా కన్పించాయి. కొన్ని ప్రాంతాలలో పంటకాలువలు కన్పించాయి. చేరవలసిన స్టేషన్ వచ్చింది. 17 లక్షల జనాభా కలిగిన షియా జియా హువాంగ్ నగరంలో ఆధునిక సౌకర్యాలు గల హెబే హోటల్‌కు చేరుకున్నాం. నగరంలో దారి పొడవునా బీజింగ్ నమూనా దృశ్యాలే. కార్లు, బైస్కిల్స్, పాదచారులకు ప్రత్యేక లైన్లు గల రహదార్లు. చైనా పాతనగరాలలో ఇదొకటి.



# ప్రజా విముక్తి సైన్యం, అంతిమ పోరాటదశ, సర్వత్రా ఎదురుదాడి - బీజింగ్ కైవసం

ఆగస్టు 22 సాయంత్రం హెబె రాష్ట్ర నాయకత్వంతో సి.పి.ఐ. ప్రతినిధి లాంఛన పూర్వకమైన సమావేశం, అనంతరం హోటల్‌లో విందుతో ఆరోజు కార్యక్రమం ముగిసింది.

హోటల్‌లో 24 గంటలు సర్వీసు అందుబాటులోవుంది. 4, 5 రెస్టారెంట్లు వున్నాయి. వ్యాపార సంస్థగా దానిని నడుపుతున్నారు. విదేశీ వ్యాపారులు తారసిల్లారు. సంగీతం, వినోదం, ఉల్లాసం, కార్యక్రమాలు రాత్రి 10 గం॥ వరకు కొనసాగుతున్నాయి. ఒక షాపింగ్ సెంటర్ వున్నది. అందులో ఖరీదైన చైనా దుస్తులు, ఇతర వినియమవస్తువులు లభ్యమవుతున్నాయి.

ఆగస్టు 23 ఉదయం - పింగ్‌షాన్ జిల్లాకు ప్రయాణం. చారిత్రాత్మక పోరాట కేంద్రం షి బైపో విప్లవ స్మారక మందిరాన్ని సందర్శించబోతున్నాం. కారులో గంటన్నర ప్రయాణం, రోడ్డు కిరువైపుల పచ్చని పంట పొలాలు, తోటలు, కొంతదూరం సాగిన తరువాత ప్రధాన రహదారి నుండి మరో రోడ్డు కొండల మీదకు పోయింది. ఒక పక్క ఎత్తైన పర్వతాలు, మరో పక్క లోయలు, సరస్సులతో ప్రకృతి దృశ్యాలు మనోహరంగా గోచరిస్తున్నాయి. అక్కడక్కడ రోడ్డు పక్కన చిన్న, చిన్న గ్రామాలు, అన్నీ కాంక్రీటు నిర్మాణాలే. నీటి మడుగులు, సెలయేళ్ళు, ప్రవాహాలు, వంతెనలు, ఎత్తుపల్లాలు రోడ్డు ప్రకృతి శోభ విరబూసినట్టుంది.

కొండల మధ్యలో వున్న షి బైపో గ్రామం 1947 నుండి 49 వరకు ప్రజా విముక్తిసైన్యం (ప్రీపుల్స్ లిబరేషన్ ఆర్మీ) సెంట్రల్ కమాండ్ కేంద్ర కార్యాలయంగా, చైనా కమ్యూనిస్టు పార్టీ అగ్రనాయకత్వం కేంద్ర స్థానంగా మారింది. బీజింగ్‌పై తుది దాడికి అక్కడనుండి సన్నాహాలు జరిగాయి. చైనా కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ 7వ సమావేశం 2వ ప్లీనం అక్కడ జరిగింది. వ్యవసాయ సంస్కరణల మహాసభ, ఆ తరువాత అనేక కీలక తీర్మానాల రూపకల్పనకు అది స్థావరం. చైనా విప్లవ చరిత్రలో దానికి ఒక ప్రత్యేక స్థానం వుంది. చైనాలో గ్రామీణ ప్రాంతాల విముక్తి దశనుండి నగర ప్రాంతాల విముక్తికి అది మార్గం చూపింది. విప్లవం, ప్రతీఘాత విప్లవం మధ్య జాతీయ విప్లవం, సామ్రాజ్యవాద దురాక్రమణ మధ్య కమ్యూనిస్టుపార్టీ,

కుమింగ్ టాంగ్ పార్టీల పంథాల మధ్య, పీపుల్స్ ఆర్మీ, దళారీనియంతల, భూస్వాముల సైన్యం మధ్య అంతిమ పోరాటం ప్రారంభమయింది.

విప్లవ స్థావరం ప్రాంగణానికి చేరుకున్నాం. దేశీ, విదేశీ యాత్రికులు గుంపులు, గుంపులుగా కోలాహలంగా తిరుగుతున్నారు. స్థానిక నాయకత్వం ఎదురువచ్చి స్వాగతం చెప్పి పెద్ద స్మారక భవనంలోకి తీసుకెళ్ళారు. 2003 సంవత్సరం ప్రారంభంలో సి.పి.సి. ప్రధాన కార్యదర్శి హు జింటావో నాయకత్వాన పోలిట్ బ్యూరో సభ్యులు అక్కడకు ప్రత్యేకంగా వచ్చి విప్లవ లక్ష్యాలకు పునరంకితమవుతూ ప్రతిన తీసుకున్నారని చెప్పారు. బ్రెజిల్, ఫ్రెంచ్ కమ్యూనిస్టు పార్టీల ప్రతినిధి వర్గాలు ఇటీవల ఆ ప్రాంతాన్ని సందర్శించాయట. కొద్దిసేపు అనంతరం ఫోటో ప్రదర్శన చూసిన తరువాత ఆనాటి కొన్ని ఘట్టాలపై డాక్యుమెంటరీ రీల్స్ చూశాం. మావో జె టుంగ్ సిగరెట్ తాగుతూ ఎవరితోనో సంభాషిస్తున్నాడు. చూటే రావడంతో ఇద్దరు కలసి సమావేశానికి వెళ్ళుతున్నారు. లీషావ్ చీ జనాన్ని ఉద్దేశించి ప్రసంగిస్తున్నాడు. ఆశ్విక దళాలు, సైనికులు, రైతుల సమావేశాలు, గెరిల్లా పోరాటాలు విముక్తి ప్రాంతాలలో భూసంస్కరణలు, ప్రజాసైన్యానికి ప్రజల స్వాగతాలు, చైనా పార్టీ నాయకత్వంతో సమాలోచనలు జరిపేందుకు అరుదెంచిన నాటి సోవియట్ కమ్యూనిస్టు పార్టీ ప్రతినిధి మికొయాన్, బీజింగ్‌వైపు ప్రజా విముక్తి సైన్యం జైత్రయాత్ర దృశ్యాలు వరుసగా కళ్ళముందు కదలిపోతున్నాయి. అరగంట న్యూస్ రీలు ముగిసింది.

విప్లవస్థావరాలు, కార్యాలయాలు, నాటి నాయకులు నివాసమున్న ఇళ్ళను చూసేందుకు బయలుదేరాం. చైనీస్, ఇంగ్లీషు భాషలలో సైన్‌బోర్డులు, స్థలాల ప్రాధాన్యతను వివరించే వివరణ వుండటం మాకు ఉపయోగపడింది.

నాయకుల నివాసంకొరకు కొంతమంది రైతులు తమ ఇళ్ళు ఖాళీ చేశారు. మావో నివాసంలో ఒక చిన్న డ్రాయింగ్‌రూం, అందులో సోఫాసెట్, ఒక పడకగది, ఒక టేబుల్, కుర్చీ, బయటకు వచ్చేగది, ఇంటిముందు ఖాళీస్థలం, అందులో ఒక పడక కుర్చీ వున్నాయి. చౌఎన్‌లై నివాసంలో ఒక పెద్ద పుస్తకాల బీరువా వుంది. ఒక లాండ్‌ఫోను టేబుల్‌పై వుంది. మొత్తం అన్నీ కలసి మూడు చిన్న గదులు. ఆ పక్క లీషావ్‌చీ, ఇతర అగ్రనాయకుల నివాసాలు. వీటి వెనుక భాగంలో చూటే నివాసం. కొద్దిగా పెద్దది. దానిని మావో కొరకు ప్రత్యేకంగా మొదట సిద్ధం చేశారట. కాని దానిని చూటేకు యివ్వమని మావో ఆదేశించాడు. వాటిని ఆనుకొని ఒక కొండ వుంది. దానిలో కొన్ని ఫర్లాంగుల వంకర టింకర సొరంగమార్గం, కొన్ని ప్రత్యేక గదులు వున్నాయి. పీపుల్స్ ఆర్మీ సెంట్రల్ కమాండ్ విలువైన రహస్య యంత్రాంగం దానిలో భద్రపరచారట. కాని ఆనాడు కొమింగ్ టాంగ్ సైన్యాలు దాని జాడ కనుగొనలేదు. సొరంగం నుండి బయటకు వస్తూ అక్కడ మరికొన్ని స్థావరాలు చూశాం. వేరుగా ఒక ప్రత్యేక భవనం, అందులో పొడుగాటి హాలు వుంది. అందులో స్కూలు విద్యార్థులు కూర్చునే బల్లలు వరుసగా సర్ది వున్నాయి. చైనా కమ్యూనిస్టుపార్టీ

కేంద్ర కమిటీ ప్లీనం దానిలోనే జరిగింది. ఆనాడు... ఎలా వున్నాయో నేడు అలాగే యథాతథంగా వుంచారు. బల్లలకు ముందు ఒక డ్రాయిర్, రెండు కుర్చీలు, బ్యాక్‌డ్రాప్ రెండు ఎర్రజెండాలు, మావో, ఛూటే చిత్రపటాలు అమర్చబడివున్నాయి. కేంద్రకమిటీ ప్లీనం వారంరోజులపాటు జరిగింది. 54 మంది పార్టీ అగ్రనాయకులు, సైనిక జనరల్స్, కమాండర్స్ సమావేశంలో పాల్గొన్నారు.

దీర్ఘకాలిక అంతర్యుద్ధాలు, లక్షల సంఖ్యలో సైన్యం నిర్మాణం, భీకర పోరాటాలు, వేలసంఖ్యలో మృతులు, నాయకుల కుటుంబాలతో సహా వలసలు, విషాదాలు, విజయాలు, గెరిల్లా పోరాటం, స్థావర యుద్ధం, విముక్తి ప్రాంతాలలో భూసంస్కరణలు, రైతుల విముక్తి, చట్టపాలన, సామ్రాజ్యవాదుల జోక్యం, దురాక్రమణ, ప్రతిఘటనా పోరాటం, కొమింగ్‌టాంగ్, కమ్యూనిస్టుపార్టీల మధ్య సంధి రాయబారం, నెలల తరబడి చర్చలు, విఫలమైన ప్రయత్నం, విద్రోహం, తిరిగి అంతర్యుద్ధం-ఇది ఒక వీరోచిత పోరాట గాథ. రాటుతేలిన నాయకత్వ, ప్రజాసైన్యం నిర్మాణం, అగ్రగామి దళం కమ్యూనిస్టుపార్టీ విజయగాథ వెనుక కీలకపాత్ర పోషించాయి.

ఆ ప్రాంగణం నుండి బయటకు వచ్చాం. నాటి కొమింగ్‌టాంగ్ ప్రతినిధి, ఒక జనరల్, స్టాలిన్ ప్రతినిధి, మికోయన్ బస చేసిన గదులు చూశాం. కొద్దిగా ముందుకు సాగాం. విశాలమైన స్క్వేర్. అందులో అద్భుతంగా చెక్కిన 5 నిలువెత్తు విగ్రహాలు, పోరాటానికి సారథ్యం వహించిన నేతలు ముందుకు సాగిపోతున్నట్టుగా ప్రతిష్ఠించబడ్డాయి. మధ్యలో మావోజెడుంగ్, కుడిచేతి వైపు మార్షల్ ఛూటే, ఎడమచేతి వైపు లీషావ్ ఛీ, ఆ చివర చౌఎన్‌లై, ఈ చివర రుబావో ఆకాశమే మన హద్దు అన్నట్టు చూపుతున్నారు. ఈ విగ్రహాలను ఇటీవల కాలంలో ఏర్పాటు చేశారు. విప్లవ స్మారక మందిరాన్ని 1968లో నిర్మించారు. 1992 నాటి చైనా పార్టీ ప్రధాన కార్యదర్శి జియాంగ్ జెమిన్ వీటిని సందర్శించారు. విప్లవ నేతలకు జేజేలు పలికి, అమరవీరులకు లాల్‌సలామ్ చెప్పింది సి.పి.ఐ. ప్రతినిధివర్గం. అది మరువలేని రోజు.



# జపాను వ్యతిరేక ప్రతిఘటనా యుద్ధం

## భారత జాతీయ కాంగ్రెసు వైద్య సహాయం
## డాక్టర్ కోట్నీస్ స్మారక భవనం

ప్రపంచ గమనాన్ని మలుపు తిప్పిన రష్యా 1917 అక్టోబరు విప్లవం తరువాత, ప్రపంచ ప్రజల దృష్టిని ఆకర్షించిన గొప్ప పోరాటం ఫాసిస్టు వ్యతిరేక ఉద్యమాలు. జర్మన్ నాజీజంకు వ్యతిరేకంగా అగ్రభాగాన నిలబడింది వీరోచిత జర్మన్ కమ్యూనిస్టు పార్టీ, కటకటాల మధ్య వున్న థేల్‌మాన్ రోజూ నాజీలకు కలలో కనిపించేవాడు. లీప్జిగ్ కోర్టు విచారణలో డిమిట్రోవ్ నాజీలపై నిప్పులు కురిపించాడు. ఇటలీలో గ్రామ్‌సీ జైలులో వుంటూనే ఫాసిజం బర్బరత్వాన్ని బహిర్గతం చేస్తూ సోషలిజానికి వెలుగుబాట చూపాడు. 1936-37 స్పెయిన్ అంతర్యుద్ధంలో లాపాషనారా ఫాసిస్టు వ్యతిరేక పోరాటానికి ప్రతీకగా నిలిచారు. జపాను మిలిటరిజం, దాని దురాక్రమణకు వ్యతిరేకంగా చైనా కమ్యూనిస్టు పార్టీ పాసిస్టు వ్యతిరేక శక్తులను సమీకరించి ప్రతిఘటనా యుద్ధాన్ని నడిపింది.

**ఫాసిజమా! ప్రజాస్వామ్యమా!**

**ఫాసిజమా! సోషలిజమా!**

**ఫాసిజమా! స్వాతంత్ర్యమా!**

నినాదాలు ప్రపంచ మంతా మారుమోగుతున్నాయి. శ్రమజీవులు, మేధావులు, రచయితలు, కళాకారులు, ప్రజాస్వామికవాదులు, నేషనలిస్టులు, శాంతి యోధులు, ఒక్కటై ఫాసిజాన్ని ప్రతిఘటిస్తున్న రోజులవి.

1937 లో భారత, చైనా దేశాల మిత్రుడు అగ్నీస్ స్మెడ్లీ సలహా మేరకు 8 వ రూట్ ఆర్మీ కమాండర్ ఇన్-ఛీఫ్ ఛూటే భారత జాతీయ కాంగ్రెసు నాయకుడు జవహర్ లాల్ నెహ్రూకు తమ పోరాటానికి వైద్య సహాయం సమకూర్చవలసిందిగా కోరారు. దానికి కాంగ్రెసు స్పందించింది.

నేతాజీ సుభాష్ చంద్రబోసు అధ్యక్షుడుగా వున్న నాటి భారత జాతీయ కాంగ్రెసు 52 వ మహాసభ జవహర్‌లాల్ నెహ్రూ చొరవతో జపాను ఆక్రమణకు వ్యతిరేకంగా పోరాడుతున్న చైనాకు సహాయ పడేందుకు డాక్టర్ల బృందాన్ని పంపటానికి నిర్ణయం తీసుకుంది. 1938 సెప్టెంబరులో భారత్ నుండి బయలుదేరిన డాక్టర్లు చోల్కర్, ముఖర్జీ, అతల్, కోట్నీస్, బసుల బృందానికి హౌరా రైల్వేస్టేషన్‌లో సుభాష్ చంద్రబోసు వీడ్కోలు చెప్పారు. బొంబాయిలో సరోజినీ నాయకత్వాన ప్రముఖుల బృందం ఒక సభ జరిపి వీడ్కోలు పలికారు.

స్టీమర్‌లో బయలుదేరిన భారతదేశ డాక్టర్లు ప్రయాణంలో కొంతమంది చైనా మేధావులతో పరిచయం కావడంతో అక్కడ పరిణామాలు, కొమింగ్ టాంగ్ కేంద్ర ప్రభుత్వం, కమ్యూనిస్టు పార్టీ నాయకత్వాన గల రెడ్ ఆర్మీ, ఆ తరువాత అది 8 వ రూట్ ఆర్మీగా మారి సాగిస్తున్న ప్రతిఘటనోద్యమం, ఉభయ పార్టీల ఐక్య ఫ్రంట్, విముక్తి ప్రాంతాలు, యానాన్ కేంద్ర స్థావరం గురించి వివరంగా తెలుసుకున్నారు. డాక్టర్ల బృందం చైనా చేరింది. 1939 లో యానాన్ వెళ్ళి అక్కడ మావో, ఛూటే, చౌ ఎన్ లైలను కలుసుకుని, పోరాట రంగానికి వెళ్ళటానికి అనుమతి తీసుకున్నారు. అప్పటికే కెనడాకు చెందిన కమ్యూనిస్టు డాక్టరు నార్మన్ బెథున్ అక్కడ సహాయ కృషిలో నిమగ్నుడయ్యాడు. కందకాలలో, తుపాకీ గుండ్ల మధ్య, మోర్టార్ల నిప్పుల్లో సైనికులకు సేవ చేస్తూనే బెథూన్ అమరుడయ్యాడు.

బెథూన్ ఇంటర్నేషనల్ పీస్ హాస్పిటల్‌కు పిన్న వయస్కుడైన డాక్టర్ కోట్నీస్‌ను డైరెక్టరుగా నియమించారు. 1942 లో హెబే రాష్ట్రంలో భయంకర వ్యాధి సోకి అక్కడే డాక్టరు కోట్నీస్ చివరి శ్వాస వదిలాడు.

23 సాయంత్రం ఆ మహనీయుని సమాధిని దర్శించి శ్రద్ధాంజలి ఘటించేందుకు వెళుతున్నాం. మా కారు స్మారక మందిరానికి చేరుకుంది. విశాలమైన ప్రాంగణంలో తోటలు, ఒక్క పక్క స్మారక మందిరం. మరోపక్క అమరజవానుల సమాధులు. మధ్య నిలువెత్తు డాక్టరు కోట్నీస్ విగ్రహం. దానిని ఆనుకుని వున్న ఆయన సమాధి. అక్కడ సిబ్బంది నిలువెత్తు పుష్పగుచ్ఛాలు అమర్చిన పెద్ద హారం, తయారుచేసి ప్రతినిధివర్గానికి అందచేశారు. ఒక్క నిముషం అందరూ మౌనం పాటించి శ్రద్ధాంజలి ఘటించారు. అంతర్జాతీయ సంఘీభావానికి దేశాల ఎల్లలు, కులాలు, మతాలు, వర్ణం, భాష అడ్డుకాలేవు.

స్మారక మందిరంలో ఫోటో ప్రదర్శనను తిలకించాం. డాక్టరు కోట్నీసు షోలాపూర్‌లో జన్మించాడు. చదువుతూనే జాతీయోద్యమం వైపు ఆకర్షించబడ్డాడు. ప్రసిద్ధ డాక్టరు అతల్ నాయకత్వాన చైనా వెళ్ళే బృందంలో ఒక సభ్యుడుగా ఎంపికయ్యాడు. చైనా వెళ్ళే వరకు కమ్యూనిజం అంటే ఏమిటో ఆయనకు తెలియదు. కళ్ళారా అక్కడ చూసిన తరువాత, స్వానుభవంతో వాస్తవాలను గ్రహించి చైనా కమ్యూనిస్టు పార్టీకి ఆకర్షితుడయ్యాడు. 1941 లో కమ్యూనిస్టు పార్టీ సభ్యత్వం తీసుకున్నాడు. నేనెందుకు కమ్యూనిస్టు నయ్యానో మిత్రులకు ఉత్తరం రాశాడు.

డాక్టరు కోట్నీస్ అమూల్య సేవలను ప్రశంసిస్తూ, ఆయన మృతికి మావో, ఛూటే, చౌ ఎన్ లై నివాళులు అర్పించారు. జవహర్‌లాల్ నెహ్రూకు ఛూటే కృతజ్ఞతలు తెలుపుతూ రాసిన లేఖ ఎగ్జిబిషన్లో వుంది. భారత జాతీయ కాంగ్రెసుకు మావో, ఛూటే ఇద్దరు సంతకాలతో రాసిన లేఖ కూడా భద్రపరచబడి వున్నది.



# వ్యవసాయరంగంలో సంస్కరణలు: పెరిగిన రైతుల ఆదాయాలు

సి.పి.ఐ. ప్రతినిధివర్గంలో సభ్యు లందరికీ వ్యవసాయంతో, గ్రామసీమలతో అనుబంధం ఎక్కువ. చైనాలో వ్యవసాయరంగంలో వస్తూన్న మార్పులను ప్రత్యక్షంగా చూడాలనే బలమైన కోర్కె సహజంగానే వారికి ఉంది. హెబీ రాష్ట్రంలో అడుగుపెట్టిననాటినుండి వాటిని తెలుసుకోవాలనే ఆతురత ఎక్కువయింది. చైనాలో సంస్కరణల పంథా వ్యవసాయథంగంతోనే ప్రారంభ మయింది. ఆ తరువాత తీర ప్రాంతాలలో ప్రత్యేక ఆర్థిక మండలాల ఏర్పాటుకు అది విస్తరించింది.

23వ తేదీ నుండి మేం కారులో ఆ రాష్ట్రంలో ఎక్కడకు వెళ్ళినప్పటికీ మాతోపాటు ప్రయాణిస్తున్న ఆ రాష్ట్ర పార్టీ ప్రతినిధులతో గ్రామాలు, రైతులను గురించి, వ్యవసాయ, కమతాల విస్తీర్ణం గురించి వివరాలు తెలుసుకునేందుకు ప్రయత్నించాం. వారు ఓపికగా సమాధాన మిచ్చేవారు. వారు తెలిపిన సమాచారం, వివరాలు స్థూలంగా ఇలా ఉన్నాయి:

చైనాలో వ్యవసాయభూమిపై యాజమాన్యపు హక్కు ప్రభుత్వానిదే. దేశ జనసంఖ్య హెచ్చు. భూమి విస్తీర్ణం పరిమితమైనది. ఎక్కడా భూమి నిరుపయోగంగా లేదు. కొంతకాలం వరకు ఫామిలీ కాంట్రాక్టు సిస్టమ్ కింద సొంతంగా సేద్యం చేసుకోదలచిన రైతులకు 20 సంవత్సరాలపాటు కౌలుకిచ్చేవారు. ఆ విధానం మంచి ఫలితా లివ్వటంతో కౌలుకాలం 30 సంవత్సరాలకు ఇటీవల పెంచారు. ఒకవేళ ఆ రైతు కాంట్రాక్టు ముగియ కుండానే చనిపోతే, ఇతర కుటుంబ సభ్యులు కోరితే ఆ కాలం ముగిసేవరకు పంటలు పండించుకోవచ్చు. పంట నిర్ణయం, దాని అమ్మకంలో రైతుకు పూర్తి స్వేచ్ఛ ఉంది.

మేం పర్యటించిన ప్రాంతంలో వ్యవసాయ భూమి విస్తీర్ణాన్ని అనుసరించి హెక్టార్‌లోపు ఒక్కొక్క కుటుంబానికి భూమి కౌలుకు లభ్యమయింది. ఎక్కువమంది అరహెక్టారు భూమిని అనుభవిస్తున్నారు.

గ్రామాలలో అంతటా ప్రభుత్వ భూమి, వ్యవసాయక్షేత్రాలు ఉన్నాయి. వాటి నిర్వహణ అంతా గ్రామకౌన్సిళ్ళదే. అది మన గ్రామపంచాయతీలాంటిది. ఇటీవల కాలంలో అగ్రో- ఇండస్ట్రీస్ (వ్యవసాయాధారిత పరిశ్రమలు) బాగా అభివృద్ధి చెందుతున్నాయి. మొక్కజొన్న, గోధుమ, సోయాబిన్ పంటలు పండ్లు, ఫలాలు, పూలతోటలు ఎక్కువగా పెంచుతున్నారు. గ్రామసీమలలో విద్య బాగా వ్యాపిస్తున్నది.

సాంస్కృతిక స్థాయి పెరుగుతున్నది. ఇళ్ళనిర్మాణం జోరుగా సాగుతున్నది. ఇళ్ళు సొంతంగా నిర్మించుకునేవారికి ప్రతి గ్రామంలోను ప్రత్యేకంగా ఇళ్ళ స్థలాలకొరకు కొంత భూమి కేటాయించారు. ఆదాయ వనరులు పెరిగినవారు ఇళ్ళస్థలాలను కొని సొంత, ప్రత్యేక ఇళ్లను కట్టుకుంటున్నారు. గ్రామసీమల వాతావరణం మారిపోతున్నది. పల్లెపట్టులు పట్టణాలుగా అభివృద్ధిచెందుతున్నాయి.

24వ తేదీ ఉదయం హెబీ రాష్ట్ర రాజధాని, జియా హువాంగ్ నగరంనుండి ప్రతినిధివర్గం ఒక జిల్లా పర్యటనకు, ఒక నగరం, కొన్ని గ్రామాలను చూసేందుకు బయలుదేరింది. ఒక గంట ప్రయాణం సాగిన అనంతరం జిల్లా పొలిమేరల్లో ఒక పైలట్ కారుతో పోలీసు అధికారి, మరోమూడు కార్లలో జిల్లా పార్టీ నాయకత్వం ప్రతినిధివర్గానికి స్వాగతం పలికారు. ఒక పావుగంటలో నిర్దేశించిన గ్రామానికి చేరుకున్నాం. ఆ గ్రామాన్ని బ్యానర్లతో అలంకరించారు. ఎర్రజెండాలు ఎగురుతున్నాయి. పోలీసులు ట్రాఫిక్‌ను కంట్రోలు చేస్తున్నారు. ప్రజలు గుంపులుగా నిలబడి చూస్తున్నారు. వీధులు విశాలంగా, రెండువైపుల చెట్ల వరుసలతో ఉన్నాయి. ఫుట్‌పాత్‌లు ప్రత్యేకంగా ఉన్నాయి. రకరకాల దుకాణాలు, డాబాలు, అపార్టుమెంటులు దర్శనమిచ్చాయి.

ఆ గ్రామం జనాభా మూడువేలు. కుటుంబాల సంఖ్య 700. మొదటిసారిగా చైనాలో ఒక గ్రామంలో అడుగుపెట్టాం. గ్రామకౌన్సిల్ భవనంలో స్థానిక నాయకత్వంతో ఒక గంటసేపు చర్చలు. ఆ గ్రామంలో ఒక పెద్ద సాంస్కృతిక మందిరం, ఒక చిన్న పరిశ్రమ కూడా ఉన్నాయి. పారా మెడికల్ కోర్సు శిక్షణ ఇచ్చే పెద్ద విద్యాసంస్థ ఉన్నది. దానిని సందర్శించాం. విశాలమైన ప్రాంగణంలో దానిని నిర్మించారు. క్రీడాస్థలం, రకరకాల పూలతోటలు ఆహ్లాదకరమైన వాతావరణం అక్కడ నెలకొంది.

ప్రభుత్వం నిర్మించిన రెండంతస్థుల ఎపార్టుమెంటులను చూశాం. రెండు రైతుకుటుంబాల ఇళ్ళలోకి వెళ్ళి కొన్ని నిముషాలపాటు కుటుంబం యోగ క్షేమాలు, పిచ్చాపాటీ మాటలతో గడిపాం. ఒక డ్రాయింగ్‌రూం, అందులో టి.వి., ఫ్రిజ్, సోఫాసెట్, రెండు పడక గదులు, ఒక కిచెన్ సౌకర్యాలతో ఆ ఇళ్లు ఉన్నాయి. మేం సందర్శించిన కుటుంబం అపార్టుమెంటును ప్రభుత్వం నుండి కొనుగోలు చేసింది. ఆమె వయస్సు 50 సంవత్సరాలు. వ్యవసాయంతోపాటు చిన్న ఉద్యోగం కూడా చేస్తున్నది. 8వ తరగతి వరకు ఆమె చదువుకుంది. భర్త కారు డ్రైవరుగా పక్క పట్టణంలో పని చేస్తున్నాడు. వారికి ఒక సంతానం. కుమార్తె చదువుకుంటున్నది. రైతుల కుటుంబ ఆదాయాలు కొన్ని రెట్లు పెరిగాయి.

ఆ గ్రామంలో పూలతోటలు చూశాం. భూగర్భజలాలతో వారు తోటలను పెంచుతున్నారు. ఎన్నిరకాల పూలు! విరగబూసినాయి. బావులను రైతులు ఉమ్మడిగా వంతులువారీగా ఉపయోగించుకుంటున్నారు. వ్యవసాయంపై ఒకే పన్నువిధానం అమలులో ఉంది. వ్యవసాయ యంత్రాలు, సామాగ్రి ఆ గ్రామ పంచాయితీకి

ఉన్నాయి. వాటిని బాడుగకు తీసుకోవచ్చు. రైతులే స్వయంగా వాటిని నడుపుతున్నారు.

అక్కడనుండి వీధిలోకి వచ్చాం. ప్రతినిధి వర్గంలో చీరకట్టుకుని ఉన్న మహిళపై అందరి దృష్టి ఉంది. మహిళలు, పిల్లలు అందరూ గుమి గూడారు. వారినుండి శెలవుతీసుకుని యెన్విలో కూరగాయలను శుద్ధిచేసే కంపెనీకి బయలుదేరాం.

చైనా-జపాను సంయుక్తంగా నిర్వహిస్తున్న కంపెనీ అది. విదేశాలకు 48 రకాల కూరగాయలను, పళ్ళను ఆ కంపెనీ ఎగుమతి చేస్తున్నది. 1200మంది కార్మికులు దానిలో పనిచేస్తున్నారు. 4 బ్రాంచీలు కూడా ఉన్నట్టు చెప్పారు.

అక్కడినుండి 7లక్షల జనాభా కల్గిన గావో నగరానికి బయలుదేరాం. అది జిల్లా కేంద్రం.



# సోషలిజం ఆధునికీకరణ

ఆగస్టు 24 ఉదయం ఒక గ్రామం, ఒక వ్యవసాయాధారిత ఫ్యాక్టరీ (కూరగాయలు శుద్ధిచేసి, ఎగుమతి చేసే కంపెనీ) సందర్శించిన అనంతరం ఆ జిల్లా కేంద్రం గావో నగరానికి ప్రతినిధి వర్గం బయలుదేరింది. ఒక పైలట్ కారు, నాలుగు కార్లు అనుసరిస్తున్నాయి. నగరంలోని పెద్ద కూడళ్ళలోనూ, బసచేసే హోటల్ వద్ద ప్రతినిధి వర్గానికి ఆహ్వానం పలుకుతూ బ్యానర్లు అలంకరించబడినాయి. నగర పార్టీ కార్యదర్శి, నగర మేయర్, ఇతర పార్టీ ముఖ్యులతో పరిచయాల అనంతరం అందరం లంచ్‌కు వెళ్ళాం. ఎన్ని వంటకాలో, ఎన్ని రుచులో లెక్కించడం కష్టం! వెజిటేరియన్, నాన్ వెజిటేరియన్, కోర్సెస్ 13 రకాలు, సూప్ రెండు రకాలు, పప్పులు 3, నూడుల్స్, వరి అన్నం, నారింజ, పుచ్చకాయల రసాలు, వారు యిచ్చిన ఆతిథ్యం, చూపిన మర్యాదలు మమ్ములను ముగ్ధులను చేశాయి.

అనంతరం రెండుగంటల పాటు నగర కమ్యూనిస్టు పార్టీ నిర్మాణంపై చర్చలు సాగాయి. 31 వేలు పార్టీ సభ్యత్వం, 250 శాఖలు, 1040 మంది క్యాడర్లతో నగర పార్టీ పనిచేస్తున్నది. నగర జనాభా 7 లక్షలు.

సాయంత్రం హెబీ రాష్ట్ర రాజధాని షి జియా హువాంగ్‌కు కారులో తిరుగు ప్రయాణం. అక్కడ చివరిసారిగా ముఖ్య నాయకత్వంతో సమాలోచనల కార్యక్రమం వుంది. రోడ్డు వెంబడి గ్రామాలు, పొలాలు పరుగెత్తుతున్నాయి.

అప్పటికి ఆరురోజులుగా చైనా డైలీ ఇంగ్లీషు ఎడిషన్ సమయం దొరికిన మేరకు చదువుతున్నా. 8 పేజీలలో యాడ్స్ లేవు. వైవిధ్యంతో, ఆకర్షణీయంగా వుంది పత్రిక. చైనా సమాజంలో వివిధ రంగాలలో ఎన్నిమార్పులు! స్పష్టంగా కనిపించేవి కొన్ని, అంతగా కనిపించనివి, కాని ఎంతో ప్రభావం కలిగించే మార్పులు మరికొన్ని చోటుచేసుకుంటున్నాయి.

## మహిళా సాధికారిత

మేం చైనాలో వున్న సమయంలోనే బీజింగ్‌లో అఖిల చైనా మహిళా మహాసభ జరుగుతున్నది. పత్రికలో పతాక శీర్షిక దానిదే. సాధించిన లక్ష్యాలు ఏమిటి? వైఫల్యాలు ఏమిటి? మహిళాలోకం ఎదుర్కొంటున్న సమస్యలపై చర్చలు వివరంగా వెలువడ్డాయి. ఐక్యరాజ్యసమితి నిర్దేశించిన 30 శాతం పదవులు (రాజకీయ అధికార స్థానాలలో) చైనాలో మహిళలు పొందినారా! అనే అంశంపై లెక్కలు తేల్చారు. వివిధ స్థాయిలలో 22 శాతం వరకు సాధించినట్లు వివరించారు. అత్యున్నత స్థానాలకు మహిళలు యిటీవల ఎన్నుకోబడ్డారు. 1300 మంది ప్రతినిధులలో 92 శాతం

కాలేజి విద్య అభ్యసించినవారే. స్వయం ఆధారిత పరిశ్రమలు నిర్వహించేవారు, సాంకేతిక నిపుణులు, శాస్త్రవేత్తలు, రచయితలు, ఇతర ఉద్యోగులు, వృత్తులు ఎంతో వైవిధ్యం మహిళా లోకంలో కన్పిస్తున్నది. అయినా పాతకాలపు సమస్యలు, ఆలోచనా ధోరణుల అవశేషాలు యింకా కొనసాగుతూ వున్నాయి.

## గ్రామాల నుండి వలసలు

నగరాలు, పట్టణాలు వేగంగా అభివృద్ధి చెందుతున్నాయి. ముఖ్యంగా గత అయిదారు సంవత్సరాలుగా అనేక కొత్త పరిశ్రమలు తలెత్తుతున్నాయి. కాలం చెల్లిన పాత పరిశ్రమలు మూతపడుతున్నాయి. 11 కోట్ల మంది శ్రమజీవులు గ్రామాల నుండి పట్టణాలకు వలసవెళ్ళారు. 62 శాతం ప్రజలు గ్రామాలలో నివసిస్తుండగా మిగిలిన 38శాతం ప్రజలు నేడు పట్టణ నాగరికతను అనుభవిస్తున్నారు. వలస వెళ్ళిన వారికి ఉద్యోగాలు, వారి పిల్లలకు చదువులు ఒక పెద్ద సమస్యగా మారింది. పట్టణ పాఠశాలలో మిగిలిన విద్యార్థులతో పోల్చితే వీరి విద్యాస్థాయి తక్కువగా వుంది. కనుక ప్రత్యేక శ్రద్ధ తీసుకోవలసి వస్తున్నది. కొత్త ఉద్యోగాలకు కావలసిన శిక్షణ గ్రామాల నుండి వచ్చిన వారికి యిస్తున్నారు. చైనాలో నమోదు చేసుకున్న నిరుద్యోగుల సంఖ్య 80 లక్షల వరకు వుంది. నిరుద్యోగులకు ప్రభుత్వం నుండి కొంత సహాయం అందుతున్నది. 6 కోట్ల వికలాంగులలో 82 శాతం వరకు పని పాట్లు కల్పించారు.

ప్రపంచంలోనే అతి పెద్దదైన మూడు నదుల అనుసంధాన బహుళార్ధ ప్రాజెక్టు త్వరలో పూర్తికానున్నది. సాగునీరు, విద్యుచ్ఛక్తి, జల రవాణా సౌకర్యాలను కల్పించే బ్రహ్మాండమైన ప్రాజెక్టు అది. భయంకరమైన వరదలను నియంత్రించి లక్షలాది ఎకరాలకు సాగునీరు, అనేక రాష్ట్రాలకు సమృద్ధిగా విద్యుచ్ఛక్తి, ఖర్చు తక్కువగా, తేలికగా సాగే నౌకా ప్రయాణం, రవాణా, లక్షలాది కుటుంబాలకు ఉపాధిని కల్పించే అద్భుత నిర్మాణం నేడు చివరి దశలో వుంది.

## అభివృద్ధి, ఆధునిక సౌకర్యాలు

130 కోట్ల చైనా జనాభాలో 95 శాతం మంది అక్షరాస్యులు. 9 సంవత్సరాల నిర్బంధ విద్య అమలులో వుంది. ప్రాథమిక స్థాయి నుండి పై స్థాయి వరకు విద్యా ప్రమాణాలను పెంచేందుకు ప్రయత్నం జరుగుతున్నది. పెరుగుతున్న అవసరాలు తీర్చేందుకు కొన్ని ప్రైవేటు పాఠశాలలకు అనుమతి యిస్తున్నారు. ప్రభుత్వ పూర్తి అజమాయిషీలోనే వీటిని నిర్వహించాలి.

పేదరికం, వెనుకబాటుతనం పారద్రోలటం చైనా ప్రాథమిక లక్ష్యాలలో ఒకటి. చైనా పత్రికల్లో ఈ సమస్యలను చర్చిస్తున్నారు. ముఖ్యంగా రైతాంగం ఆదాయాన్ని పెంచటంపై శ్రద్ధ వహిస్తున్నారు. వెనుకబాటుతనాన్ని అధిగమించేందుకు కొత్త పథకాలు 2003 సంవత్సరంలో రూపొందాయి. నిరుపేదల సంఖ్య ఐరాస లెక్కల ప్రకారం బాగా తగ్గింది. చైనా అధికారిక లెక్కల ప్రకారం వారి శాతం స్వల్పం.

గత 20 సంవత్సరాల కాలంలో సోషలిస్టు సంస్కరణలు అమలు కారణంగా ప్రజల జీవన ప్రమాణాలు గణనీయంగా పెరిగాయి. ఆర్థిక పెరుగుదల రేటు 8,9 శాతం వరకు వున్నది. ముఖ్యంగా గత మూడు, నాలుగు సంవత్సరాల కాలంలో పట్టణ నాగరిక జీవనంలో ఆధునిక సౌకర్యాల కల్పనలో గుణాత్మక మార్పులు వచ్చాయి. సెల్‌ఫోన్ల వాడకందార్ల సంఖ్య 20 కోట్లకు పెరిగింది. లాండ్ ఫోన్లు మరో 20 కోట్ల వరకు వున్నాయి. టి.వి. సెట్స్ తయారీలో ప్రపంచంలో చైనా అగ్రస్థానంలో వుంది. 96 శాతం ప్రజలకు టి.వి. కనక్షన్ వుంది. ప్రైవేటు చిన్నకార్ల సంఖ్య ఒక కోటికి పైగా వున్నట్లు ప్రతి 120 మందిలో ఒకరికి సొంతకారు వుందని ఆగస్టులో విడుదలైన సమాచారం తెలుపుతున్నది.

మార్కెట్ ఆర్థికవ్యవస్థలో అవినీతి పెరిగింది. దానిపై పెద్ద పోరాటం నేడు సాగుతున్నది. ఒకవైపు చట్టబద్ధ చర్యలు, మరోవైపు పార్టీ రాజకీయ ప్రచారం ఒక ఉద్యమంగానే చేపట్టారు. అవినీతి పలు రూపాలలో ప్రత్యక్షమవుతున్నది. హాంకాంగ్ ద్వారా చైనా నుండి విదేశాలకు డబ్బు పోతున్నది. విదేశీ వాణిజ్య వ్యవహారాలలో ముడుపులు చేతులు మారుతున్నాయి. రియల్ ఎస్టేట్‌లో అధికారులు బంధుప్రీతి, లంచగొండితనానికి పాల్పడుతున్నారు. కొన్ని ప్రాంతాలలో ముఠాలు క్లబ్బులు, లాటరీలు నిర్వహిస్తున్నాయి. వీటిపై పోలీసు దాడులు సాగిస్తున్నారు. అరెస్టులు చేస్తున్నారు. నిఘా ఎక్కువయింది. వీటి సమాచారం పత్రికల్లో, టి.వి.లో ప్రసారమవుతున్నాయి. అవినీతి ప్రక్షాళనపై ప్రజాభిప్రాయాన్ని సేకరిస్తున్నారు. ప్రజాస్పందన సానుకూలంగా వుంది.

గ్రామాలలో వివాహ రిజిస్ట్రేషన్‌కు సంబంధించి గతంలో వున్న పనికి మాలిన నిబంధనలను పాస్ పోర్టుల నుండి ఈ సంవత్సరం తొలగించారు. పనికి సంబంధించిన సర్టిఫికెట్లు, మెడికల్ సర్టిఫికెట్లు యిపుడు సమర్పించవలసిన అవసరం లేదు. పౌరుల స్వేచ్ఛా, స్వాతంత్ర్యాల పరిధి పెరిగింది. పౌరుల పాత్రను పెంచడం ద్వారా రాజకీయ, పరిపాలనా వ్యవస్థను, ప్రజాస్వామ్యాన్ని విస్తరింపచేసేందుకు బీజింగ్‌లో అంతర్జాతీయ ఫౌండేషన్‌లతో ఉమ్మడిగా సెమినార్‌లను నిర్వహిస్తున్నారు. కొత్త రాజకీయ నాగరికతను సృష్టిస్తున్నారు. జాతీయ ఆర్థికవ్యవస్థలో ప్రభుత్వరంగం ఆస్తులు 70 శాతంకు పైగా వున్నాయి. విదేశీ పెట్టుబడుల అనుమతి, సంయుక్తరంగంలో పరిశ్రమల నిర్మాణం ఉభయత్రా ప్రయోజనకరంగా వుంటేనే సాధ్యం. 10 వేలమంది కార్మికులు, ఉద్యోగులతో పనిచేస్తున్న పెప్సీ కంపెనీ తన భాగస్వామిపై కోర్టు కెళ్ళింది. పెప్సీ వ్యాపార పెత్తనం చెలాయిస్తున్నదని దాని భాగస్వామి కూడా కోర్టుకెళ్ళారు. అంతర్జాతీయ కోర్టులు, చట్టాలు డబ్ల్యు. టి. ఓ. నిబంధనలపై చర్చలు సాగుతున్నాయి.

## మావో, డెంగ్, జియాంగ్ జెమిన్‌ల మార్గదర్శకత్వం

సోషలిజం నిర్మాణంలో ఎదురవుతున్న సమస్యలు, చైనా కమ్యూనిస్టుపార్టీ వినూత్న ఆలోచన, ఆచరణపై చైనాలోనూ, బయట ప్రపంచంలోనూ ముఖ్యంగా

కమ్యూనిస్టు శ్రేణులలో వ్యక్తమవుతున్న సానుకూల అభిప్రాయాలు, అనుమానాలు, అక్కడ పత్రికలలో సాగుతున్న చర్చలు, చూస్తున్నవీ మా మెదళ్ళను గంటన్నరసేపు ప్రయాణంలో కుదిపి వేస్తున్నాయి. అంతలోనే షి జియా హువాంగ్ నగరంలోకి ప్రవేశించగానే ఒక పెద్ద స్క్వేర్‌లో డెంగ్ సియావో పెంగ్, జియాంగ్ జెమిన్ బొమ్మలను చిత్రించి వున్న కాన్వాస్ పటం అలంకరించబడివుంది. బయట వీధులలో వీరి చిత్రాలను చూడటం యిదే మొదటిసారి.

చైనా కమ్యూనిస్టుపార్టీ లక్ష్యం సోషలిజం. దాని సిద్ధాంత మార్గదర్శకత్వం మార్క్సిజం-లెనినిజం, మావో ఆలోచన, డెంగ్ సియావోపెంగ్ సిద్ధాంతం, మూడు ప్రాతినిధ్యాల భావన. గత నవంబరులో జరిగిన సి.పి.పి. 16వ మహాసభ తన లక్ష్యాలను, భావజాలాన్ని నిర్వచించింది. చైనా విప్లవానికి మార్క్సిజం-లెనినిజం సిద్ధాంతాన్ని అన్వయించి దానిని విజయవంతంగా నడిపిన నేత మావో జె దుంగ్. విప్లవ అనంతరం చైనా ప్రజా రిపబ్లిక్ ఏర్పడిన తరువాత 1949 నుండి 1978 వరకు సోషలిజం నిర్మాణం, ప్రయోగాలు, అనుకరణలు, సాఫల్యతలు, దుస్సాహసిక విధానాల కారణంగా సంభవించిన భారీ నష్టాలు, అనుభవాలతో నిండివుంది. ఆ కీలక దశలో చైనా లక్షణాలతో కూడిన సోషలిజాన్ని నిర్వచించిన నాయకుడు డెంగ్ జియావో పెంగ్. మానవ వనరులను, శాస్త్ర, సాంకేతిక పరిజ్ఞానాన్ని పూర్తిగా ఉపయోగించుకుని ఉత్పాదక శక్తులను అభివృద్ధిపరచడం, సోషలిజానికి నిబద్ధత, కమ్యూనిస్టుపార్టీ నాయకత్వం, మార్క్సిజం-లెనినిజం మావో ఆలోచన మార్గదర్శకత్వంగా డెంగ్ సిద్ధాంతం రూపొందింది. డెంగ్ రెండవ తరం నాయకులు. చైనా లక్షణాలతో కూడిన సోషలిజాన్ని, సుసంపన్నమైన సోషలిజంగా పరివర్తనచేయడం, ప్రపంచీకరణ క్రమంలో సామ్రాజ్యవాద సంస్కృతి ప్రభావాన్నుండి చైనా సంస్కృతిని కాపాడుకుని, సోషలిస్టు సంస్కృతిని, విలువలను పెంపొందించడం జియాంగ్ జెమిన్ భావన. దీనినే మూడు ప్రాతినిధ్యాల భావన అని నిర్వచించారు. ప్రస్తుతం ఆయన మిలటరీ కంట్రోలు కమిషన్ ఉపాధ్యక్షుడుగా వున్నారు. వీరు మూడవతరం నాయకులు. సి.పి.సి. ప్రస్తుత ప్రధాన కార్యదర్శి ము జింటావో నాల్గవ తరం నాయకులు.

## మార్క్సిజం సిద్ధాంతం

సాయంత్రం హెబీ హోటల్‌కు చేరుకున్నాం. 6.30 గంటలకు చివరిసారిగా పార్టీ నాయకత్వంతో ఆసక్తిదాయకమైన రీతిలో సంభాషణలు, చర్చలు ప్రారంభమయినాయి.

హెబీ రాష్ట్రంలో బౌద్ధమతం ప్రభావం ఎక్కువ. బౌద్ధారామాలు, విగ్రహాలు నేటికీ చాలా వున్నాయి. చైనా ప్రాచీన చక్రవర్తులు, ప్రజలు బౌద్ధమతాన్ని అభిమానించారు. వారి రాజధాని నగరం, రాజ మందిరాలు యిప్పటికీ ఆ రాష్ట్రంలో చెక్కు చెదరకుండా వున్నాయి. భారత-చైనా స్నేహ సంబంధాలు ఆ కాలంలోనే పెంపొందాయి.

ఆ తరువాత ప్రశ్నలు-సమాధానాల రూపంలో చైనాలో సోషలిజం నిర్మాణంపై సంభాషణ మళ్ళింది.

సోషలిజం నిర్మాణంలో ఎదురవుతున్న ప్రధాన అవరోధాలు ఏమిటి?

"ఆలోచనా శక్తిని విముక్తి చేయాలనే భావన" సారం ఏమిటి?

"వాస్తవాల నుండి సత్యాన్ని అన్వేషించు" ఈ సూత్రాల అర్థం ఏమిటి?

ఇవి ప్రధాన ప్రశ్నలు.

చైనా పార్టీ నాయకులు యిచ్చిన సమాధానాలు సూటిగా, వివరణాత్మకంగా వున్నాయి.

**మొదటిది రైతు సమస్య:** ఇప్పటికీ వారి సంఖ్య అధికంగానే వుంది. చిన్నకారురైతు సోషలిజం భావజాలాన్ని జీర్ణించుకోవడం తేలికకాదు.

**రెండవది మానసిక విముక్తి:** ఇందులో రెండు అంశాలు వున్నాయి. భావజాలానికి, మేనేజిమెంటుకు రెండింటికి సంబంధించినవి.

ఆర్థిక సరళీకరణ కారణంగా లాభాపేక్ష పెరిగింది. ఆ మేరకు కార్మికునికి నష్టం. పనికి తగిన ప్రతిఫలం పొందటం సోషలిజంలో శ్రమజీవుని హక్కు. దానిని అమలుపరచాలి.

**మూడోది పాత ప్రణాళికా విధానం:** స్టేట్ నియంత్రణలో మొత్తం ఆర్థికవ్యవస్థ వుండేది. ప్రతి ఒక్కడూ ప్రతి దానిని స్టేట్ నుండి ఆశిస్తున్నారు. ఆ మేరకు చొరవ కోల్పోయారు. స్వీయాభివృద్ధి కుంటుపడింది. పాత మేనేజిమెంటు పద్ధతులు సోషలిజం పురోగతికి అవరోధంగా మారాయి. ఇప్పటికీ జాతీయ ఆర్థిక వ్యవస్థలో 70 శాతం పైగా ప్రభుత్వరంగానికి చెందినదే. పాత నియంత్రణ పద్ధతులను మార్చుతున్నాం.

**నాల్గవది మార్క్సిజంను విడనాడబోం:** చైనా వాస్తవ పరిస్థితులకు ఆ సిద్ధాంతాన్ని వర్తింపజేస్తున్నాం. మా దేశ అనుభవాలు, సోవియట్ అనుభవాలు, ఇతర దేశాల అనుభవాలను పరిగణనలోకి తీసుకుంటున్నాం. మీ సూచనలను, అభిప్రాయాలను కూడా ఆహ్వానిస్తున్నాం అని వారు వివరించారు.

సోషలిజం ప్రయోగం అందునా చైనా లాంటి అతిపెద్ద దేశం జయప్రదం కావాలి అనే టోస్టుతో ఉత్సాహ, ఉద్వేగాలతో సాగిన సంభాషణ, విందు ముగిశాయి.

ఆగస్టు 26 మా పర్యటన చివరిరోజు. ఉదయాన్నే 6 గంటలకు మేం బసచేసిన హోటల్ నుండి ఒక కిలోమీటరు దూరం ఒక పెద్ద రోడ్డు వెంబడి నడుస్తూపోతుండగా సంగీత ధ్వనులు సోకుతున్నాయి. కొంచెం ముందుకు వెళితే అదో పెద్ద పార్కు. వయోభేదం, లింగభేదం లేకుండా ఆడ, మగ అక్కడ వ్యాయామం చేస్తున్నారు. అది డ్రిల్లు కాదు. చైనా సాంప్రదాయపు పద్ధతిలో అవయవాల కదలికలతో సున్నితంగా, నెమ్మదిగా సాగుతున్న విన్యాసం. ఎదురుగా వున్న స్క్వేర్‌లో ఖాళీ స్థలంలో వందలాదిమంది మూకగా మరొక తరహా వ్యాయామం చేస్తున్నారు. ఆ రోడ్డు పొడవునా కూరగాయలు, పళ్ళు, రెడీమేడ్ దుస్తులు, తిను బండారాలు, ఇతర

వస్తువుల అమ్మకాలు సాగుతున్నాయి. తిరిగి హోటల్‌కు చేరుకునే ప్రధాన వీధిలోకి ప్రవేశించగానే వరుసగా బారులుతీరి, వందలాది మంది సైకిల్ ప్రయాణీకులు నిరాఘాటంగా, ప్రవాహంలా పనులకు పోతున్నారు. విచిత్రంగా కన్పించిన అరుదైన దృశ్యం అది. 10 గంటలకు షాపింగ్ కాంప్లెక్స్‌కు వెళ్ళాం. వస్తువుల కొరత లేదు. పెద్ద క్యూలు లేవు.

## బీజింగ్ నుండి ఢిల్లీకి

మధ్యాహ్నం బీజింగ్‌కు తిరిగి రైలులో ప్రయాణం. ఆ సాయంత్రం పార్టీ హోటల్ వాన్ షూకు చేరుకున్నాం. ఢిల్లీ ప్రయాణానికి మా సామాను సర్దుకుని బీజింగ్‌లోని భారత రాయబార కార్యాలయం ఆహ్వానం మేరకు దౌత్య ప్రతినిధులను కలుసుకునేందుకు బయలుదేరాం. విమానాశ్రయంకు వెళ్ళే దారిలోనే వున్న హాలిడే ఇన్ హోటల్‌లో సమావేశం, విందు ఏర్పాటు చేసినట్లు తెలిపారు.

చైనాలో గత 10 సంవత్సరాల కాలంలో ముఖ్యంగా మౌలిక సదుపాయాల కల్పనలో (Infrastructure) పెద్ద పురోగతి వుందని భారతదేశ దౌత్య అధికారులు భావిస్తున్నారు. వారందరూ చైనా భాషా పరిజ్ఞానం కలిగినవారే. భారత్, చైనాల మధ్య స్నేహ సంబంధాలకు చైనా విదేశాంగ విధానంలో ప్రాధాన్యత వుంది. ప్రధాని వాజ్‌పేయి పర్యటన ముఖ్యమైనదిగా వారు భావిస్తున్నారు. బహుళ ధృవ ప్రపంచం కొరకు నూతన ప్రపంచవ్యవస్థ కొరకు వారు కృషి చేస్తున్నారు.

రాత్రి 10.30 గంటలకు విమానాశ్రయం చేరుకున్నాం. అర్ధరాత్రి 12 గంటలు దాటిన తరువాత తిరిగి ఢిల్లీకి యం. యు. 563 విమానంలో బయలుదేరాం. సి.పి.సి. కేంద్ర కమిటీ అంతర్జాతీయ విభాగం అధికారులు సాదరంగా వీడ్కోలు చెప్పారు.



# చైనా గురించిన అవగాహన

చైనా సోషలిస్టు ఆధునికీకరణ గురించి, నేటి ప్రపంచ రాజకీయాలలో దాని పాత్ర గురించిన అవగాహనపై వివిధ వర్గాలలో భిన్నాభిప్రాయాలు సహజంగానే వ్యక్తమవుతున్నాయి. వామపక్షంలో కూడా ఒకే అభిప్రాయం లేదు. మొదటిది అక్కడ మార్పులు అపూర్వమైనవి. రెండోది సమగ్ర సమాచారం కొరవడటం కారణంగా సందేహాలకు, అనుమానాలకు ఆస్కారం ఉంటుంది.

కమ్యూనిస్టు వర్గాలలో మూడు ప్రశ్నలు తలెత్తుతున్నాయి. ఒకటి: సామ్రాజ్యవాదం నూతనదశలో ప్రవేశించిన కాలంలో ముఖ్యంగా అమెరికా ఆధిపత్య వాదం ఉగ్రరూపం ప్రదర్శిస్తున్న దశలో సోషలిస్టు చైనా ప్రపంచ వ్యాపితంగా సామ్రాజ్యవాద వ్యతిరేక శక్తులను సమీకరించటంలో తగినంత పెద్ద పాత్ర వహిస్తున్నదా? రెండు: ఆధునికీకరణ, విదేశీ పెట్టుబడుల ప్రవేశానికి అనుమతి, మార్కెట్ పాత్ర, డబ్ల్యు.టి.ఓ.లో ప్రవేశంతో అక్కడ సోషలిస్టు విలువలు, సంస్కృతి, సమాజ ప్రయోజనాలు బలహీనపడి, అంతిమంగా సోషలిస్టు వ్యవస్థకు ముప్పువాటిల్లదా! మూడు: అవినీతి బ్రహ్మజెముడుగా వ్యాప్తి చెందుతున్నది. కమ్యూనిస్టు పార్టీని కూడా తొలిచివేసే ప్రమాదం ఏర్పడితే ఇక గతి ఏమిటి?

మారుతున్న పరిణామాలను చర్చించేటపుడు వాస్తవాల ఆధారంగా మన అవగాహనను పెంచుకోవటం సత్యాన్వేషణకు సరియైన మార్గం.

వాస్తవాల ఆధారంగా సత్యాన్ని తెలుసుకోవడం అనే డెంగ్ జియావ్ పెంగ్ సూత్రీకరణ చైనాలో పెద్ద ప్రచారంలో ఉంది. సామాజిక ఆలోచనను ఆ విధంగా ప్రభావితం చేయటం వారి లక్ష్యం.

**మొదటి** ప్రశ్న: ఇక విషయాలకు వద్దాం. మా పరిశీలనలో, అధ్యయనంలో స్పష్టమైన అంశాలను ఇక్కడ వివరించటానికి ప్రయత్నించాం.

ప్రపంచ రాజకీయ పరిణామాలు, ముఖ్యంగా సెప్టెంబర్ 11 టెర్రరిస్టు దాడి అనంతరం గుణాత్మకంగా మార్పు చెందాయని చైనా పరిశీలకులు పత్రికలలో, గోష్టులలో విశ్లేషణ చేశారు. సామ్రాజ్యవాద ప్రస్తుత దశను గురించిన చర్చ కొనసాగుతున్నది. ఆఫ్ఘన్‌స్థాన్, ఇరాక్‌లపై అమెరికా ఏకపక్షదాడి, ఆక్రమణ, బుష్ ముందస్తుదాడి సిద్ధాంతం, ఇతర ప్రపంచ దేశాలలో ఏకైక అగ్రరాజ్యం జోక్యం పెరిగే ప్రమాదం, పెద్ద రాజ్యాలమధ్య ఆధిపత్యపోరు గురించి విశ్వవిద్యాలయాలలో గోష్టులు జరుగుతున్నాయి. నగరాలలో నిరసన ప్రదర్శనలను నిర్వహించారు. వచ్చే జనవరిలో,

బొంబాయిలో జరిగే వరల్డ్ సోషల్ ఫోరంలో పాల్గొనేందుకు చైనా స్వచ్ఛంద సంస్థలు నిర్ణయం తీసుకున్నాయి.

ప్రపంచ యుద్ధంలాంటివి జరిగే అవకాశాలు తక్కువగా ఉన్నప్పటికీ చిన్నస్థాయి యుద్ధాలు, ప్రాంతీయ ఘర్షణలు ఆగవు అనేవి వారి అంచనా. కనుక దేశ భద్రతా వ్యవస్థను పటిష్టం చేసుకోవటానికి ప్రథమ ప్రాధాన్యత ఇస్తున్నారు. ప్రపంచంలోని ఉద్రిక్తత ఉండే కేంద్రాలలో యురేషియా ఒకటి కనుక బలమైన, స్థిరమైన చైనాను నిర్మించుకోవటం ద్వారా ప్రపంచ రాజకీయాలలో సముచితపాత్ర నిర్వహించగల్గుతామని, బహుళధృవ ప్రపంచ వ్యవస్థ కొరకు, నూతన ప్రజాస్వామ్య వ్యవస్థ కొరకు ఐ.రా.స.ను బలపరుస్తూ ప్రపంచశాంతి కొరకు కృషి సాగాలనేది వారి విధానంగా ఉంది.

**రెండో** ప్రశ్న: ఆధునిక సోషలిజం, లక్షణాలను గురించి విస్తృతమైన చర్చ అన్ని స్థాయిలలో జరుగుతున్నది. ఇటీవల సాహిత్యంలో, పార్టీనాయకుల ప్రసంగాలలో, నివేదికలలో కొత్త భావనలు కన్పిస్తున్నాయి. ఉదా: "సోషలిస్టు రాజకీయ నాగరికత" గత నెలలో బీజింగ్‌లో ఫోర్డ్ ఫౌండేషన్, చైనాలోని విశ్వవిద్యాలయాలు, అకాడమీల సంయుక్త ఆధ్వర్యంలో ఒక గోష్టి జరిగింది. చైనాలో కిందిస్థాయి నుండి పై వరకు ప్రజల పాత్రను, నిమగ్నతను పెంచే ప్రజాస్వామ్య ప్రక్రియను రూపొందించటం అంశంపై అంతర్జాతీయ స్థాయిలో జరిగిన గోష్టిలో వివిధ దేశాల నిపుణులు, మేధావులు పాల్గొన్నారు. మార్క్సిజంను చైనా నిర్దిష్ట పరిస్థితులకు అన్వయించే క్రమంలో సోషలిస్టు విప్లవం, నిర్మాణం వివిధ దశలలో మావో ఆలోచన, డెంగ్ జియావో పెంగ్ సిద్ధాంతం, మూడు ప్రాతినిధ్యాల భావన పెంపొందాయి. ఆధునిక సోషలిజం నేటి దశలో మూడు ప్రాతినిధ్యాల భావనలోని (జియాంగ్ జెమిన్ సృజనాత్మకత) కీలకాంశం ఏమిటి? నేటి ప్రపంచీకరణ క్రమంలో సామ్రాజ్యవాద సంస్కృతి, దుష్ప్రభావానికి లోనుకాకుండా సోషలిస్టు సంస్కృతి, ఆత్మిక నాగరికతను పెంపొందించుకోవటం ముఖ్య కర్తవ్యం. కనుకనే విద్య, విజ్ఞానం, శాస్త్రీయదృక్పథం ప్రాతిపదికగా సాంస్కృతికంగా పురోగమించాలనే లక్ష్యాన్ని నొక్కి చెపుతున్నారు.

**మూడో** ప్రశ్న: బహుళవిధమైన ఆర్థిక చట్రాలు (ప్రభుత్వ, సహకార, ప్రైవేటు రంగాలు) బలపడుతున్న దశలో మార్కెట్ పాత్ర, ప్రపంచీకరణ క్రమంలో పెరుగుతున్న అవాంఛనీయ ధోరణులపై నిశితమైన విమర్శలు చెలరేగుతున్నాయి. అందులో అవినీతి రూపాలు, దాని హానికర ప్రభావం గురించి బహిరంగ చర్చలు సాగుతున్నాయి. పత్రికలు, టీ.వి, రేడియో, ప్రసార మాధ్యమాలలో వాటిని బహిర్గతం చేస్తున్నారు. చట్టపరంగా, రాజకీయంగా చర్యలు తీసుకుంటున్నారు. అవినీతిని ప్రక్షాళన చేసే క్రమం పైనుండి కూడ ఒక ఉద్యమంగా సాగుతున్నది. విద్య, సాంస్కృతిక స్థాయిని పెంచడం, జీవన ప్రమాణాలను నిరంతరం మెరుగు

పరచడం, సమగ్రాభివృద్ధిలో భాగంగా సామాజిక, ఆర్థికాభివృద్ధిని ఏకోన్ముఖంగా సాధించడంపై దృష్టి కేంద్రీకృతమయింది.

చైనా అభివృద్ధిపై లండన్ నుండి వెలువడే "ఎకనమిస్టు" పత్రిక ప్రచురించిన ఒక సమాచారాన్ని టైమ్స్ ఆఫ్ ఇండియా ఇటీవల పునర్ముద్రించింది. గత 20 సంవత్సరాలకాలంలో చైనాలో 40 కోట్ల మందిని దారిద్ర్యరేఖ నుండి బయటపడేశారు. అంటే ఆకలినుండి విముక్తి కల్గించారనేగా అర్థం! ఆ మేరకు దారిద్ర్యాన్ని పారద్రోలారు. ఇదే విషయాన్ని మొన్న ప్రపంచ బ్యాంకు ఆసియా నివేదిక కూడా ప్రచురించింది.

ఇది ఆధునిక సోషలిజం విజయం కాదా!



# చైనాపై చంద్రబాబు నాయుడు, డాక్టర్ జయప్రకాశ్‌ల ఆలోచనలు

ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడుగారు గత శాసనసభా సమావేశంలో చర్చకు సమాధానమిస్తూ ధాటిగా మాట్లాడారు. ఆయన ఆలోచనా స్రవంతికి సంబంధించిన ఒక అంశాన్ని పరిశీలిద్దాం. సంస్కరణల ఆవశ్యకతను నొక్కి చెప్పటం ఆయన ఉద్దేశం. భారత, చైనా దేశాలమధ్య అభివృద్ధిని పోల్చుతూ, అక్షరాస్యత, విద్య, పేదరికం నిర్మూలన, ఆర్థికాభివృద్ధిరేటు, ఎగుమతి దిగుమతుల వాణిజ్యం, ప్రజల జీవన ప్రమాణాలతో చైనా సాధించిన విజయాలను శ్లాఘించారు. 21వ శతాబ్దంలో భారతదేశం ఇంకా వెనుకబడితే మన గౌరవం ఏమిటి? మనస్థానం ఏమిటనేది ప్రశ్న.

చైనాలో సంస్కరణలు చూసైనా ఆంధ్రదేశంలో అనుసరిస్తున్న సంస్కరణలను ఎందుకు బలపరచరు? అనేది చంద్రబాబునాయుడుగారు విసిరిన సవాల్!

ఒక పరిణామాన్ని పరిశీలించేటపుడు పైకి కన్పించే రూపాన్నిచూసి మాత్రమే నిర్ధారణకు రావటం ఒక తరహా ఆలోచన. కాని దాని అంతఃస్సారాన్ని గ్రహించి సత్యాన్ని తేల్చటం శాస్త్రీయమైన ఆలోచన.

సంస్కరణలు, సంస్కరణలు... కాని వాటి సామాజికాంశం ఏమిటి? వర్గ ప్రయోజనం ఏమిటి? అంతిమంగా ఏ వ్యవస్థలో ఆ మార్పు వస్తున్నదీ పరిశీలించాలి గదా! ఆంధ్రప్రదేశ్‌లో, భారతదేశంలో ఆర్థిక సంస్కరణల వెనుక ఒక రాజకీయ భావజాలం ఉంది. అందులో ప్రయివేటీకరణ అనేది ఒక మూల స్తంభం. ప్రభుత్వరంగాన్ని బద్దలుగొట్టి ప్రైవేటు పెట్టుబడిదారుకు లాభం చేకూర్చే విధానం, సంక్షేమరంగాన్ని క్రమేపీ రద్దు చేయటం మరో కీలకాంశం. శాస్త్ర, సాంకేతిక పరిజ్ఞానానికి పెద్ద పీట వేయాలనేది చర్చనీయాంశం కాదు. శాస్త్ర, సాంకేతిక పరిజ్ఞానం, సమాచార విప్లవం, మౌలిక సదుపాయాల కల్పనతోపాటు సామాజిక, ఆర్థికాభివృద్ధికి సమతూకాభివృద్ధికి ఆర్థిక వ్యవస్థలో ఎటువంటి మార్పులు రావాలనేది ప్రశ్న. చైనా ఆర్థిక వ్యవస్థలో ప్రభుత్వరంగం కీలక పాత్ర పోషిస్తున్నది. నిర్దేశించిన రంగాలలో, సహకార రంగానికి, ప్రయివేటురంగానికి ప్రోత్సాహం ఉన్నది. అదే సమయంలో ప్రజలకు విద్య, వైద్య, ఉపాధి సౌకర్యాల కల్పన, ఇంటివసతి, స్వయంపోషకానికి ప్రోత్సాహం, అంతిమంగా పేదరికాన్ని నిర్మూలించటం, మొత్తం క్రమంలో ప్రజలను నిమగ్నం చేయడం, దానికి కావలసిన రాజకీయ నాయకత్వాన్ని సమకూర్చుకోవటం జరిగింది. 130 కోట్ల మంది ప్రజలుగల చైనాను ఆ మార్గంలో

నడిపించటానికి ఒక ప్రేరణ, ఒక భావజాలం, ఒక సిద్ధాంతం, ఒక ఆదర్శం ఉన్నాయి. దానికి అనుగుణ్యమైన సామాజిక, రాజకీయ వ్యవస్థ అక్కడ ఉంది. అది సోషలిజం. ఈ అంశాలన్నింటినీ పరిశీలించవద్దా!

మనదేశంలో, రాష్ట్రంలో పది సంవత్సరాలుగా ఆర్థిక సంస్కరణలు కొనసాగుతున్నప్పటికీ సామాజికరంగాలలో గర్వించదగిన విజయాలు ఎందుకు సిద్ధించలేదు? ఆర్థికరంగంలో స్తబ్దత, లేదా క్షీణత కన్పిస్తున్నది ఎందుచేత? సామాజిక అశాంతి మాత్రం ప్రబలుతున్నది. అవునా! సామాజిక సంక్షోభం తీవ్రమవుతున్నదనడానికి ఇది సంకేతం.

* * * *

లోక్‌సత్తా వ్యవస్థాపకులు, డాక్టరు జయప్రకాష్ నారాయణ్‌గారు అక్టోబరు 5 "ఈనాడు" దినపత్రికలో ఒక విశ్లేషణాత్మక వ్యాసం రాశారు. అనేకానేక అంశాలు - సిద్ధాంతం, రాజకీయాలు, నియంతృత్వం, ప్రజాస్వామ్యం, హింస, అహింస, విప్లవాలు; నీతి, అవినీతి, వ్యవస్థ ప్రక్షాళన, పౌరసమాజం, ప్రజల చైతన్యం, వ్యక్తిస్వేచ్ఛ, సామాజిక న్యాయం, మతం, కులం, మౌఢ్యం - పై నిశిత పరిశీలన, వ్యాఖ్యానాలు అందులో వున్నాయి. అన్నీ ఆలోచించదగినవే!

పరస్పర సంబంధం కల్గిన రెండు ముఖ్యపరిణామాలు ఆయన దృష్టిలో ఎందుకోలేవు!

గత శతాబ్దం చరిత్ర తుది తీర్పు చెప్పిందంటూ "1989-91లో మధ్య, తూర్పు, ఐరోపాలోని అన్ని దేశాలలోనూ ప్రజల తిరుగుబాటుతో నియంతృత్వాలు కూలిపోయాయి" అని వాటిని జయప్రకాష్ నారాయణ్ స్వాగతించారు. అక్కడ ప్రజాస్వామిక విప్లవాలు విజయవంతం అయ్యాయని ఆయన నిర్ధారణ.

'చైనాలో ఏకపార్టీ పాలన కొనసాగుతున్నా మావో ప్రవచించిన సిద్ధాంతాలకు, ఆ దేశం పాటిస్తున్న విధానాలకు ఏమాత్రం పొంతన లేదు. ఇలా దిశమార్చిన కారణంగా గత 26 ఏళ్ళుగా చైనా సాధించిన ప్రగతి ప్రపంచ చరిత్రలోనే ఓ అత్యద్భుత పరిణామం"గా ఆయన శ్లాఘించారు. "వియత్నాం ఇపుడు కాలం చెల్లిన సిద్ధాంతాలకు స్వస్తిచెప్పి శరవేగంతో ప్రగతి సాధిస్తోంది" అని కూడా ఆయన పేర్కొన్నారు.

"చివరికి ప్రపంచంలో నేటికీ మిగిలివున్న ఏకైక కమ్యూనిస్టు దేశం క్యూబా కూడా తన విధానాలను మార్చుకుంటోంది అంటూ మరొక వాదనలోకి వెళ్ళారు. ఆ వాదనను పరిశీలించేముందు నేటికీ మిగిలిన ఏకైక కమ్యూనిస్టు దేశం క్యూబా అని ఆయన నిర్ధారణకు రావటంలో అంతరార్థం ఏమిటి? పైన పేర్కొన్న చైనా, వియత్నాం దేశాలు ఆయన దృష్టిలో ఏ కేటగిరిలో ఉన్నాయి. ఆయన వాదనకు, నిర్ధారణకు ప్రాతిపదికలుగాని, వివరణగాని ఆయన వ్యాసంలో ఎక్కడాలేవు.

కాని అంతర్లీనంగా ఒక ఆలోచన ఆయన వాదనలో కన్పిస్తున్నది. "ప్రజాస్వామ్యంలో, సామ్యవాద వ్యవస్థలోని బలమైన అంశాలను సమన్వయం చేయటంవల్ల మాత్రమే శాంతి, సుస్థిరత, వ్యక్తి ఔన్నత్యం, సామాజిక సహజీవనం సాధ్యమని ఆధునిక చరిత్ర తిరుగులేని పాఠం చెప్పింది" అంటూ జయప్రకాష్ అంతిమంగా ఈ కింద పేర్కొన్న నిర్ధారణకు వచ్చారు.

"వ్యక్తి స్వేచ్ఛను, ప్రజాస్వామ్యాన్ని, స్వేచ్ఛా వాణిజ్యాన్ని, సాంఘిక న్యాయాన్ని, సామాజిక భద్రతను కలగలపటంలో పాశ్చాత్యదేశాలు విజయం సాధించాయి. ప్రజాస్వామ్యం, స్వేచ్ఛ, సామాజిక భద్రత–సహజీవనం చేయటం వల్ల ఆర్థిక ప్రగతి, సాంఘిక న్యాయం – రెండూ సాధ్యమవుతాయని, పీడిత జనులకు నిజమైన విముక్తి ఆ విధంగానే సాధ్యమని ఆ దేశాలు రుజువు చేసాయి."

కనుక డాక్టరు జయప్రకాష్ నారాయణ్‌గారి మౌలిక ఆలోచన, వాదన ఏమంటే పాశ్చాత్య దేశాలు ఆదర్శ సమాజాలని, పీడిత జనులకు నిజమైన విముక్తి అటువంటి వ్యవస్థలోనే సాధ్యమయిందని పేర్కొనటం.

పాశ్చాత్యదేశాలు అంటే ఏవి? ఆమెరికాను ఆయన మినహాయించారు. అది స్వేచ్ఛా వాణిజ్య దేశం కనుక. ఆయన వాదన ఇంకా ఇలా కొనసాగింది. రెండు సిద్ధాంతాలు, రెండు వ్యవస్థలు వాటి మధ్య తిరుగులేనివైరం అని వేరువేరుగా చూడటం తగదని హితవు చెప్పారు. అలా జరిగితే భవిష్యత్ తరాలు మనల్ని క్షమించవని హెచ్చరించారు.

ఇలా సాగింది జయప్రకాష్ గారి పరిశీలనా పద్ధతి!

కాని వాస్తవ పరిస్థితి అలా ఉన్నదా! పాశ్చాత్య దేశాలు, యూరోపియన్ యూనియన్ విస్తరణ, నాటో సభ్యత్వం కల్గిన దేశాలు, సైనికీకరణ పథకాలు, బహుళజాతి కంపెనీల పెత్తనం, అక్కడ ప్రభుత్వాలు అనుసరిస్తున్న సంక్షేమ వ్యతిరేక విధానాలు, ఆర్థిక మాంద్యం, పెరుగుతున్న నిరుద్యోగం, సమ్మెలు, నిరసన ప్రదర్శనలు, కొత్తతరహా ఉద్యమాలు, జాతి వివక్షత, అవినీతి కుంభకోణాలు, నైతిక పతనం – ఈ పరిణామాలను ఎలా విశ్లేషించాలి?

ఒక వేళ అక్కడ పార్లమెంటరీ ప్రజాస్వామ్యం, సంక్షేమ పథకాలు, చట్టాలు, బహుళపార్టీ వ్యవస్థ ఇంకా వున్నాయి. కనుక, మిగిలిన సామాజిక, ఆర్థిక అంశాలను చూడ నిరాకరిద్దామా? ఇది సమగ్ర పరిశీలనా పద్ధతా? ఇది ఏ భావజాల ధోరణి!



# చైనాపై గోష్ఠి

గత కొద్దివారాలలో సి.ఆర్. ఫౌండేషన్ ఆధ్వర్యంలోని నీలం రాజశేఖరరెడ్డి రీసెర్చి సెంటర్‌లో రెండు గోష్ఠులు జరిగాయి. ఒకటి గ్రామ్సీ ఆలోచన, రెండు చైనా అభివృద్ధి పంథా, సోషలిస్టు మార్కెట్.

రెండవ గోష్ఠి అక్టోబరు 11న చైనా సంస్కరణలపై జరిగింది.

చైనాపై జరిగిన చర్చలో లేవనెత్తబడిన ముఖ్యమైన అంశాలు:

❖ చైనాలో నేడున్న వ్యవస్థ లక్షణాలు

❖ సోషలిజం, ప్లానింగ్, మార్కెట్ సమస్యలు.

❖ ప్రస్తుత సంస్కరణలు
సోషలిజంను బలపరుస్తున్నాయా! లేక సోషలిజం వక్రీకరణా?

❖ చైనా అభివృద్ధి పంథా ఫలితాలు ఏమిటి?
అత్యధిక ప్రజానీకానికి ప్రయోజనం కల్గిందా! లేదా!

❖ ప్రపంచ రాజకీయాలలో నేటి చైనా పాత్ర.

❖ చైనా కమ్యూనిస్టు పార్టీ నిబంధనావళిలో సవరణ. చైనా రాజ్యాంగంలో సవరణ.

వక్తల ప్రసంగాలలో భిన్నాభిప్రాయాలు, అంచనాలు, వ్యక్తమయినాయి. కాని చైనాలో సోషలిజం నిర్మాణం విజయవంతం కావాలనే కాంక్ష, అందరిలోను ప్రస్ఫుటంగా వ్యక్తమయింది. $3\frac{1}{2}$ గంటలపాటు చర్చ ఆసాంతం ఆసక్తికరంగా జరిగింది. కొన్ని అంశాలపై స్పష్టత ఏర్పడటానికి చర్చ తోడ్పడిందనే భావం పలువురు వెలిబుచ్చారు.

గోష్ఠిలో పాల్గొన్న డాక్టరు వై. రాధాకృష్ణమూర్తి గారు ప్రసంగానికి తయారుచేసుకున్న నోట్స్‌ను, గత సంవత్సరం ఆయన చైనా పర్యటనానుభవాలపై రాసిన చిరు పుస్తకాన్ని ఇచ్చారు. ఆ తరువాత వాటిని చదివాను. వాస్తవికంగా ఉపయోగకరంగా వున్నాయి. ఆయన చెప్పినట్లు సహజంగానే వారి అధ్యయనానికి, పరిశీలనకు పరిమితులున్నాయి.



# చైనా సోషలిస్టు పంథా

**(అక్టోబరు 11న నీలం రాజశేఖరరెడ్డి పరిశోధనా కేంద్రంలో చైనా సంస్కరణలపై జరిగిన గోష్టిలో రచయిత ప్రసంగం నోట్స్ ఆధారంగా రాసిన వ్యాసం.)**

ఈ అక్టోబర్ 8వ తేదీన బీజింగ్‌లో చైనా కమ్యూనిస్టు పార్టీ, వియత్నాం కమ్యూనిస్టు పార్టీల పొలిట్‌బ్యూరో సభ్యులతో సహా, పలువురు మేధావులు పాల్గొన్న చర్చాగోష్టి ఒకటి జరిగింది. దాని అంశం "సోషలిజం, మార్కెట్ ఎకానమీ." సోషలిజం పరిస్థితులలో మార్కెట్ ఎకానమీని అభివృద్ధిపరచే సమస్యలపై అవగాహనను పెంచుకోవటం, అనుభవాలను మార్పిడి చేసుకోవటం తమ ఉద్దేశ్యమని నిర్వాహకులు వివరించారు. రెండు దేశాలూ సోషలిజం నిర్మాణంలో ఉన్నాయి. సోషలిజం నియమాలను అర్థం చేసుకునేందుకు, ఆచరణలో వాటి ప్రయోజనం పొందేందుకు, ఉభయదేశాల మధ్య స్నేహం బలపడేందుకు ఇటువంటి గోష్టులు సహాయపడతాయని ఉభయ పార్టీల నాయకులు తమ పరిచయ వాక్యాలలో ఆశాభావం వెలిబుచ్చారు. దీనికిగల ప్రాధాన్యతను, విలువను వారు నొక్కి చెప్పారు. ఈ రెండు దేశాల జనాభా 135 కోట్లు.

అక్టోబరు 11-14 తేదీలలో చైనా కమ్యూనిస్టు పార్టీ 16వ కేంద్రకమిటీ 3వ ప్లీనరీ సమావేశం జరిగింది. సోషలిస్టు మార్కెట్ ఆర్థిక వ్యవస్థను మెరుగుపరచుకునేందుకు చేపట్టవలసిన ముఖ్య కర్తవ్యాలను కేంద్ర కమిటీ నివేదిక వివరించింది.

భారతదేశంలో కూడా వివిధ రాజకీయ పక్షాల నాయకులు, మేధావులు, ఆర్థికవేత్తలు చైనా సంస్కరణలను ఆసక్తితో పరిశీలిస్తున్నారు. అనేక కోణాలనుండి దానిపై చర్చలు సాగుతున్నాయి. భారత, చైనా దేశాలు రెండూ ప్రపంచంలో అతి పెద్ద జనాభా కల్గినవి. ప్రాచీన నాగరికత, సంస్కృతులు విరాజిల్లిన దేశాలు. రెండూ వ్యవసాయకదేశాలు. పేదరికం, వెనుకబాటుతనం, అవిద్య సమస్యలను విస్తృతమైన స్థాయిలో ఎదుర్కొంటున్న దేశాలు. సహజంగానే ప్రాచీన కాలంనుండి ఉన్న స్నేహ సంబంధాల రీత్యా, నేటి ప్రపంచీకరణ క్రమంలో పెరుగుతున్న సాన్నిహిత్యం రీత్యా, మార్పులు, అనుభవాల పరస్పర ప్రభావం ఉభయదేశాలలో ఉంటుంది.

# సంస్కరణల స్వభావం - పురోగతి

1978 చివరిలో చైనాలో ఆధునికీకరణకు శ్రీకారం చుట్టారు. అప్పటివరకు కేంద్రీకృత ప్రణాళికాబద్ధ ఆర్థిక విధానం అమలులో ఉంది. చైనా సామాజిక - ఆర్థిక వ్యవస్థలో విప్లవాత్మక మార్పులు అంతకుముందు కాలంలో చోటుచేసుకున్నప్పటికీ, ఆశించిన ఫలితాలు సమకూరలేదు. సోషలిజం నిర్మాణం అనేక సవాళ్ళను ఎదుర్కొన్నది. పేదరికాన్ని నిర్మూలించలేకపోయింది. వెనుకబాటుతనాన్ని అధిగమించి సమతూకాభివృద్ధిని సాధించలేకపోయింది. గొప్పముందంజ (1958), సాంస్కృతిక విప్లవం (1966-76) కాలంలో విషాదకరమైన పరిణామాలు వాటిల్లాయి. సంపద పంపిణీ సమానంగా జరగాలనే సూత్రం అమలులో ఉండేది. ఆర్థిక సమానత్వం అనే మావో ఆలోచన దానికి ప్రాతిపదిక.

పెరుగుతున్న ప్రజల భౌతిక అవసరాలను తీర్చడం, ఉత్పాదక శక్తులను అభివృద్ధి చేయటం, శాస్త్ర, సాంకేతిక మార్పులను ఆర్థిక సంస్కరణలతో జోడించి బలమైన ఆర్థిక వ్యవస్థను నిర్మించడం డెంగ్ జియావో పెంగ్ సిద్ధాంతం. దానిని 1978లో ఆయన రూపొందించాడు. చైనా లక్షణాలతో కూడిన సోషలిజంగా దానిని డెంగ్ నిర్వచించాడు. అది ఒక సుదీర్ఘ క్రమం. దానిని సాధించేందుకు మూడు చారిత్రక కర్తవ్యాలను పేర్కొన్నారు. చైనా ఆధునికీకరణ, జాతీయ ఐక్యత, సోషలిజం అభివృద్ధి. ఈ క్రమంలో సోషలిస్టు మార్కెట్ ఎకానమీ అభివృద్ధి చెందింది. గత 25 సంవత్సరాలకాలంలో, సంస్కరణల పంథా సాధించిన ఫలితాలు ఏమిటి? సానుకూల, ప్రతికూల పరిణామాలు ఏమిటి? అనే అంశాలను పరిశీలించాలి.

సోషలిజం ఆధునికీకరణ కార్యక్రమం అన్ని రంగాలకు విస్తరించింది. వ్యవసాయ, పారిశ్రామిక, సేవా రంగాలు, పరిపాలనా వ్యవస్థ, దౌత్యరంగం, ప్రజాస్వామ్యం, ఎన్నికలు, పౌర సమాజంలో హక్కులు, స్వేచ్ఛ, న్యాయవ్యవస్థ, విద్య, వైద్య రంగాలు, సామాజిక భద్రత, దేశరాజ్యాంగం, వివాహవ్యవస్థ, నగరీకరణలో భాగంగా గ్రామాల నుండి వలసలు, విదేశీయాత్ర, ఇంకా ఇతర రంగాలలో మార్పులు వస్తున్నాయి. వీటి ఫలితాలను, ప్రభావాన్ని సమీక్షిస్తున్నారు. వాటిలో కొన్నింటిని ఇక్కడ పరిశీలిద్దాం.

# ఆకలినుండి విముక్తి: ఆర్థిక, సామాజికాభివృద్ధి

చైనా అధికారిక లెక్కల ప్రకారం 130 కోట్ల మంది జనాభాలో 4 లేక 5 శాతం మంది ప్రజలు మాత్రమే దారిద్ర్యరేఖ అడుగున నేడు జీవిస్తున్నారు. అంటే 120 కోట్లమంది ప్రజలు ప్రాథమిక సౌకర్యాలను అనుభవిస్తున్నట్టు విదితమవుతున్నది. ముఖ్యంగా ఈ 13 సంవత్సరాల కాలంలో చైనాలో సాధించిన సామాజిక, ఆర్థికాభివృద్ధి నూతన దశలో ప్రవేశించినట్టు, రానున్న 15

సంవత్సరాలకాలంలో 2020 నాటికి సంపన్న సమాజంగా అది రూపొందనున్నట్టు చైనా నిపుణులు పేర్కొంటున్నారు.

**ఈ అంచనాకుగల ప్రాతిపదిక ఏమిటి?** అర్థికాభివృద్ధిరేటు స్థిరంగా 9 శాతంకు పైగానే ఉంది. అంతర్జాతీయంగా అనేక ఇతర దేశాలలో ఏర్పడిన ద్రవ్య సంక్షోభం, ఆర్థిక మాంద్యం, చైనాపై పెద్ద ప్రభావాన్ని చూపలేకపోయాయి. ప్రజల భౌతికావసరాలను తీర్చేస్థాయిలో పారిశ్రామిక, వ్యవసాయ, సేవా రంగాలలో వస్తూత్పత్తి పెరుగుతున్నది.

130 కోట్ల జనాభాలో 73 కోట్ల మంది (77 శాతం) వివిధరకాల ఉద్యోగాలకు, పనులకు వెళుతున్నారు. బాలబాలికలను, వృద్ధులను మినహాయిస్తే మిగిలిన నిరుద్యోగులకు కనీస జీవన సౌకర్యాలను కల్పించేందుకు కొత్త చట్టాలు వచ్చాయి.

గ్రామీణ ప్రాంతాలలో నివసిస్తున్న 80 కోట్ల మందికి గతంలో ఛిన్నాభిన్నమయిన వైద్యసేవలను కల్పించేందుకు పెద్ద ఎత్తున నూతన పారామెడికల్ యంత్రాంగాన్ని నిర్మిస్తున్నారు. వివిధ పట్టణాలలో, గ్రామాలలో ప్రభుత్వ నిధులతో ఆరోగ్య కేంద్రాలను నిర్మించటంతోపాటు ప్రైవేటు క్లినిక్‌లను అనుమతిస్తున్నారు. ప్రభుత్వం, సమిష్టి, సహకార వ్యాపార సంస్థలు, వ్యక్తులనుండి సేకరించిన నిధులతో "సహకార వైద్య సేవలు" అనే ఉమ్మడి వ్యవస్థ ఒకటి ఇటీవల కాలంలో రూపొందింది. గ్రామీణ ప్రజలకు వైద్య సౌకర్యాలు ఇంకా అందుబాటులో లేనందున అసంతృప్తి వుంది.

విద్యారంగంలో గొప్ప పురోగతి ఉంది. 9వ తరగతివరకు నిర్బంధ సెకండరీ విద్య జయప్రదంగా అమలవుతున్నది. పిల్లలు హాజరు సంఖ్య 95 శాతం వరకు ఉంది. 10 కోట్ల మంది రైతులకు ప్రతి సంవత్సరం సాంకేతిక, వృత్తివిద్యలో సామర్థ్యాన్ని పెంచేందుకు ప్రత్యేక శిక్షణ యిస్తున్నారు. గ్రామాలనుండి పట్టణాలకు వలసవెళ్ళే రైతులకు, ముఖ్యంగా యువకులకు ప్రతి సంవత్సరం 2 కోట్ల మందికి కొత్త విద్యాకోర్సులలో శిక్షణ ఇస్తున్నారు. ఆధునిక పరిశ్రమలలో ఉద్యోగం పొందేందుకు లేదా స్వయం పోషక జీవనాన్ని గడిపేందుకు కావలసిన నైపుణ్యాన్ని పెంపొందించటం దీని లక్ష్యం. దానికిగాను రుణ సౌకర్యాలను కల్పిస్తున్నారు. నిరుపేద కుటుంబాలకు చెందిన విద్యార్థినీ, విద్యార్థులకు, వెనుకబడిన ప్రాంతాలకు సహాయపడేందుకు ప్రత్యేక పథకాలను రూపొందించారు. సబ్సిడీలను పెంచారు.

వ్యవసాయంలో కుటుంబ కాంట్రాక్టు విధానాన్ని సంస్కరణల తొలిదశలోనే ప్రవేశపెట్టారు. భూమికౌలుకు తీసుకొని సొంత సేద్యంతో పంటను మార్కెట్‌లో అమ్ముకునే స్వేచ్ఛావిధానం కారణంగా రైతుల ఆదాయం కొన్నిరెట్లు పెరిగింది. హెచ్చు ఆదాయం ఆర్జించేవారు సొంత ఇళ్ళను నిర్మించుకుంటున్నారు. గ్రామ సాముదాయక భూమిలో కొంత భాగాన్ని వ్యక్తుల గృహనిర్మాణం కొరకు అమ్మటానికి కేటాయించారు.

అదే సందర్భంలో భారీస్థాయి వ్యవసాయాన్ని క్రమానుగతంగా అభివృద్ధి చేయవలసిన అవసరాన్ని అక్టోబరు 11-14 తేదీలలో జరిగిన పార్టీ కేంద్రకమిటీ సమావేశం నొక్కిచెప్పింది.

పారిశ్రామికీకరణ కారణంగా గ్రామాలనుండి వలసలు పెరుగుతున్నాయి. .ఈ మార్పుల కారణంగా పౌరజీవితంలో గతంలో ఉన్న నిబంధనలను సడలించటమో, లేక రద్దు చేయటమో జరిగింది. ఉదాహరణకు పాస్ పోర్టు సిస్టమ్‌లో మార్పులు వచ్చాయి. వివాహ రిజిస్ట్రేషన్‌కు ముందు సమర్పించవలసిన కొన్ని సర్టిఫికెట్లను రద్దు చేశారు. పనిచేసే సంస్థ నుండి ఒక సర్టిఫికెట్, మెడికల్ సర్టిఫికెట్ సమర్పించవలసిన అవసరం ఇక లేదు. ఆ మేరకు బ్యూరాక్రసీ పెత్తనం, అవినీతి సమసిపోయింది. గ్రామీణ ప్రాంతాలలో అలుముకున్న వెనుకబాటుతనాన్ని పారద్రోలేందుకు ఇంకా జరగవలసిన కృషి ఎంతో వుందని చైనా నాయకత్వం హెచ్చరిస్తున్నది.

గత 13 సంవత్సరాలకాలంలో ప్రభుత్వరంగంలో పరిశ్రమల సంఖ్య 1,02,300 నుండి 46,800కు తగ్గిపోయింది. నష్టాలలో ఉన్న వాటిలో కొన్నింటిని మూసివేయడం, మరికొన్నింటిని సంయుక్త రంగానికి బదిలీ చేయటం జరిగింది. నూతన పారిశ్రామికీకరణ విధానం వలన, సాంకేతిక సామర్థ్యాన్ని పెంచినందువలన లాభాలు గణనీయంగా పెరిగాయి. వాతావరణ కాలుష్యాన్ని నివారించగల్గుతున్నారు. మానవ వనరులను సద్వినియోగ పరచుకోగల్గుతున్నారు. మూసివేయబడిన ఫ్యాక్టరీ కార్మికులకు ట్రేడ్ యూనియన్లు, ప్రభుత్వ సంస్థలు పలురూపాలలో సహాయపడుతున్నాయి. స్వయం ఉపాధికి కావలసిన రుణ సౌకర్యాలు, పునఃశిక్షణా తరగతులు నిర్వహించటంద్వారా ఫ్యాక్టరీలలో ఉద్యోగాలు పొందే అవకాశాలను కల్పిస్తున్నారు.

విదేశీ కంపెనీలు, వ్యాపార సంస్థలు, పెట్టుబడులు చైనా మార్కెట్‌లో ప్రవేశించాయి. పరస్పర ప్రయోజనకరంగా అవి నిర్వహించబడాలి. ట్రేడ్ యూనియన్‌ల నిర్మాణం, కార్మికుల హక్కులకు భద్రతను కల్పించటం ఒక ముఖ్యమైన షరతు. ఇటీవల కాలంలో పెప్సీ కంపెనీ, వాల్ మార్ట్ వ్యాపార సంస్థల నుండి కొన్ని సమస్యలు ఉత్పన్నమయ్యాయి. కోర్టుల ద్వారా, ఇతర మార్గాల ద్వారా వాటిని పరిష్కరించటానికి ప్రయత్నిస్తున్నారు. విదేశీ వాణిజ్యం, విదేశీ కంపెనీల, వ్యాపార సంస్థల లాభాపేక్ష, చైనాలో అవినీతి విస్తరణకు ఒక భూమికను కల్పిస్తున్నది. ప్రభుత్వాధికార్లకు, కమ్యూనిస్టుపార్టీ ముఖ్యులకు కూడ అవినీతి విస్తరించింది. మిశ్రమ ఆర్థిక వ్యవస్థలో తలెత్తిన ప్రతికూల పరిణామాలలో అవినీతితోపాటు, మాదకద్రవ్యాల వ్యాపారం, వ్యవస్థీకృతనేరం, వ్యభిచారం కూడా పెరిగాయి. ఆదాయ వ్యత్యాసాల కారణంగా ఆర్థిక అసమానతలు పెగిగాయి.

# సోషలిస్టు రాజకీయ, ఆత్మిక నాగరికత

చైనా జాతీయ ఆర్థిక వ్యవస్థలో ప్రణాళికా విధానం అమలులో వుంది. అది నిర్వహించే పాత్రలో మార్పులు వచ్చాయి. దీర్ఘకాలిక, స్వల్పకాలిక ప్రణాళికలు ఆర్థిక, సామాజిక అభివృద్ధిని సమన్వయ పరుస్తున్నాయి. చైనా ఆర్థిక వ్యవస్థలో ప్రభుత్వరంగం ఆస్తి 70 శాతం వరకు ఉంది. మిగిలిన 30 శాతం ఆస్తి ప్రైవేటు, సహకార రంగాలలో వున్నది. ఆర్థిక సంస్కరణల పంథా అనేక రంగాలలో ముఖ్యంగా ఆర్థిక, శాస్త్ర, సాంకేతిక రంగాలలో అద్భుత ఫలితాలను సమకూర్చింది. 20 కోట్లు సెల్‌ఫోన్లు, మరో 20 కోట్లు లాండ్ ఫోన్లు వినిమయంలో ఉన్నాయి. 96 శాతం ప్రజలకు టి.వి. కనెక్షన్లు ఉన్నాయి. 96 శాతం ప్రజలకు అక్షరాస్యతను కల్పించారు. ఒక కోటికిపైగా ప్రైవేటు చిన్నకార్లు తిరుగుతున్నాయి. ఏ ప్రమాణాలను బట్టి చూసినా ఇవి పెద్ద విజయాలే.

ఇదే కాలంలో పైన పేర్కొన్న ప్రతికూల పరిణామాలు తలెత్తాయి. ప్రపంచీకరణ క్రమంలో భాగంగా సామ్రాజ్యవాద సంస్కృతి ప్రభావం విస్తరిస్తోంది. దాని ప్రభావం చైనాపై కూడ ఉన్నది. కనుకనే సాంస్కృతిక రంగంలో తక్షణం తీసుకోవలసిన చర్యలపైన, సోషలిస్టు సంస్కృతి, విలువలను పెంపొందించటంపైన, జియాంగ్ జెమిన్ నాయకత్వం (మూడవతరం) దృష్టిని కేంద్రీకరించింది. ఆయన ప్రతిపాదించిన మూడు ప్రాతినిధ్యాల భావనలో పార్టీ నాయకుల పనిశైలి, పారదర్శకత, ప్రజాస్వామ్య విస్తరణ కూడా ముఖ్యాంశాలుగా ఉన్నాయి. పురోగామి ఉత్పాదక శక్తులకు, పరిణత సంస్కృతికి, శాస్త్రీయ విజ్ఞానానికి కమ్యూనిస్టు పార్టీ ప్రాతినిధ్యం వహించాలని జియాంగ్ జెమిన్ వివరించారు. ప్రస్తుతం నాల్గవతరం నాయకత్వం ఆమార్గ దర్శకత్వంలో ముందుకు వెళుతున్నది.

సోషలిస్టు భౌతిక, రాజకీయ, ఆత్మిక నాగరికతలను సమన్వయపూర్వకంగా అభివృద్ధిపరచేందుకు విస్తృతమైన చర్చలు సాగుతున్నాయి. ప్రజల భౌతికావసరాలను సంతృప్తి పరచటంలో పురోగతి ఉంది. ఇప్పుడు ఆత్మిక నాగరికతను పెంపొందించేందుకు సోషలిస్టు సైద్ధాంతిక, నైతిక, విద్యా బోధనా కార్యక్రమాన్ని చైనా కమ్యూనిస్టుపార్టీ రూపొందించింది. అవినీతిలాంటి ప్రతికూల పరిణామాలను తుదముట్టించేందుకు సివిల్ సర్వీసు వ్యవస్థలో పెద్ద మార్పులు తీసుకువస్తున్నారు. ప్రజాభిప్రాయాన్ని సేకరించి పదోన్నతిని కల్పిస్తున్నారు. సామర్థ్యాన్ని పెంచేందుకు కామన్ పరీక్షలు నిర్వహిస్తున్నారు. ప్రజాస్వామ్య విస్తరణకుగల అవకాశాలను, ఇతర దేశాల అనుభవాలను పరిశీలిస్తున్నారు. తద్వారా నూతన సోషలిస్టు నాగరికతకు ప్రాతిపదికలు కల్పిస్తున్నారు.

సంస్కరణలలో పురోగతిని సాధించటానికి గ్యారంటీ సమాజంలో చైనా కమ్యూనిస్టుపార్టీ నిర్వహిస్తున్న నాయకత్వ పాత్రే. శ్రామికుల అగ్రగామి దళంగా, ప్రజలప్రయోజనాలకు ప్రతీకగా అటువంటి పాత్రను చైనా కమ్యూనిస్టుపార్టీ

నిర్వహిస్తున్నది. చైనా మహత్తర లక్ష్యం కమ్యూనిజం. అది సుదీర్ఘ చారిత్రిక క్రమం. నేటి పరివర్తన దశలో చైనా లక్షణాలతో కూడిన సోషలిజాన్ని నిర్మించటంలో మూడు కర్తవ్యాలను పరిపూర్తి చేయాలి. అవి సోషలిస్టు మార్కెట్ ఆర్థిక వ్యవస్థ, ప్రజాస్వామ్య రాజకీయాలు, పరిణతిచెందిన సంస్కృతి.

రాజ్యాంగ రీత్యా బహువిధములైన ఆస్తి యాజమాన్యపు హక్కు నేడు చైనాలో వున్నప్పటికీ ప్రభుత్వరంగం కీలకపాత్ర పోషిస్తున్నదని పైన ప్రస్తావించాను. ఆదాయం పంపిణీ కూడా బహు విధాలుగా వున్నప్పటికీ, పనినిబట్టి ప్రతిఫలం ప్రధాన రూపంగా వుంది. వీటిని ఇంకా మెరుగు పరిచేందుకు తగు చర్యలు తీసుకుంటున్నారు.

# ముగింపు మాట

**చివరిలో ఒక మాట.** చైనా దేశానికి, కమ్యూనిస్టు పార్టీకి మార్గదర్శకత్వం వహిస్తున్న భావజాలం మార్క్సిజం - లెనినిజం, మావో ఆలోచన, డెంగ్ జియావ్ పెంగ్ సిద్ధాంతం, మూడు ప్రాతినిధ్యాల భావన.

మావోను గొప్ప నాయకుడుగా చైనా గౌరవిస్తున్నది. చైనా విప్లవాన్ని విజయవంతం చేయడంలో ఆయన నాయకత్వ పాత్రను ప్రశంసిస్తూ మార్క్సిజాన్ని చైనా నిర్దిష్ట పరిస్థితులకు అన్వయించటంలో దానిని సృజనాత్మకంగా అభివృద్ధి పరచాడనేది చైనా కమ్యూనిస్టు పార్టీ అంచనా. సోషలిజం నిర్మాణంలో సంస్కరణల ముందు దశలో కొన్ని పెదధోరణులు వ్యక్తమయినప్పటికీ మావో ఆలోచనను పోజిటివ్‌గా పరిగణిస్తున్నారు. మావో ఆరాధన తత్వం నేడు లేదు. కొరియా యుద్ధానికి మావో కుమారుడుని పంపటం, యుద్ధంలో ఆయన మృతి - ఇవన్నీ మావో నాయకత్వ లక్షణాలుగా వారు పేర్కొంటున్నారు.

రెండవ తరానికి చెందిన డెంగ్ నాయకత్వంలో సోషలిజం ఆధునికీకరణకు శ్రీకారం చుట్టారు.

మూడవ తరానికి ప్రాతినిధ్యం వహించిన జియాంగ్ జెమిన్ సోషలిస్టు సంస్కృతిని, నాగరికతను పెంపొందించే కార్యక్రమాన్ని రూపొందించాడు. మూడు ప్రాతినిధ్యాల భావన దానికి ప్రతిబింబం.

నాల్గవ తరానికి ఆయన నాయకత్వ బాధ్యతలు అప్పగించారు. నాయకత్వ మార్పులు సాఫీగా జరిగాయి. సిద్ధాంతాన్ని సృజనాత్మకంగా అభివృద్ధి పరుస్తున్నారు. వాస్తవాల ఆధారంగా సత్యాన్ని నిర్ధారిస్తున్నారు. ఆత్మ విశ్వాసంతో పురోగమిస్తున్నారు. వారి ఆశయ బలం గొప్పది.



123-ఎ (29-10) పర్మినెంట్

# చారిత్రాత్మక నిర్ణయాలు

ఏ విప్లవం మరో విప్లవానికి కార్బన్ కాపీ కాదు. సోషలిజానికి ప్రతిదేశం సొంతమార్గంలో చేరుకుంటుంది. సోషలిజం నిర్మాణానికి బ్లూప్రింట్ ఏదీ లేదు.

20వ శతాబ్దం ప్రారంభంలో లెనిన్ రష్యన్ విప్లవపంథాను రూపొందించాడు. విప్లవకర పార్టీని నిర్మించాడు. కార్మిక, కర్షక ఐక్యతను సాధించాడు. యూరప్‌లో, వెనకబడిన రష్యాలో రాచరిక వ్యవస్థను, సామ్రాజ్యవాద అనుకూల బూర్జువా ప్రభుత్వాన్ని తొలగించి సోషలిస్టు ప్రభుత్వాన్ని నెలకొల్పారు. నాటి రష్యాలో సోషలిస్టు విప్లవం అసాధ్యమన్నారు. సాధ్యం చేశారు బోల్షివిక్కులు. బాధాకరమైన అన్వేషణలో మార్క్సిజం సిద్ధాంత మార్గదర్శకత్వంలో రష్యా విప్లవ మార్గాన్ని కనుగొన్నది. ఆ తరువాత సోషలిజాన్ని ఎలా నిర్మించాలి? పూర్వపు అనుభవం లేదు, మూడు ప్రత్యామ్నాయ మార్గాలపై నరాలు తెగిపోయేటంత తీవ్ర చర్చలు నాటి నాయకత్వంలో జరిగాయి. 1923లో చనిపోయేముందు సోషలిజం గురించి తనకు ఏర్పడిన నూతన అవగాహనను చివరి లేఖలలో వివరించారు.

అక్టోబర్ విప్లవం తరువాత 20వ శతాబ్దంలో పెద్ద ప్రాధాన్యత కలిగినది చైనా విప్లవం, రైతాంగ దేశం చైనాలో నూతన ప్రజాస్వామ్య విప్లవానికి మావో వ్యూహరచన చేశారు. సామ్రాజ్యవాదం, ఫ్యూడలిజం, బ్యూరాక్రటిక్ బూర్జువాకి వ్యతిరేకంగా రైతాంగం, కార్మికవర్గం విస్తరించుకుంటూ చైనాను విముక్తి చేశారు. ఈ విప్లవ క్రమానికి కమ్యూనిస్టుపార్టీ నాయకత్వం వహించింది. మార్క్సిజం - లెనినిజం సిద్ధాంతాన్ని చైనా పరిస్థితులకు సృజనాత్మకంగా అన్వయించటం ద్వారా చైనా విప్లవ మార్గాన్ని కనుగొన్నది. మావో నాయకత్వం వారి ఉమ్మడి అనుభవం, విజ్ఞతనే మావో ఆలోచనగా అభివర్ణించారు.

రైతాంగ దేశంలో సోషలిజాన్ని ఎలా నిర్మించాలి? అంతర్జాతీయ అనుభవాలు, విప్లవక్రమంలో చేకూరిన సొంత అనుభవాలు వున్నాయి. ఒక సుప్రసిద్ధ ఫ్రెంచి రచయిత చైనా అధ్యక్షుడు మావోను సోషలిజం ఎలా వుంటుంది? అని ప్రశ్నించాడు. మాస్కో మెట్రోవలే వుంటుందని ఆయన సమాధానమిచ్చాడు. అది ఉపమానం. కానీ వందకోట్ల జనాభా కలిగిన దేశంలో, ఒక వెనుకబడిన దేశంలో, దీర్ఘకాలిక అంతర్యుద్ధంలో చిన్నాభిన్నమైన దేశంలో సోషలిజాన్ని వాస్తవం చేసేది ఎలా? పరివర్తనకు ఎంతకాలం పడుతుంది? ప్రపంచ పరిణామాల ప్రభావం ఎలా వుంటుందో! కొరియా యుద్ధం, ప్రచ్ఛన్నయుద్ధం, సామ్రాజ్యవాదుల కుట్రలు, అణ్వస్త్రాలతో బెదిరింపులు, ఆర్థిక ఆంక్షలు ఎక్కడకు దారితీస్తాయో? మానవాళిని

రక్షించటం సోషలిజం కర్తవ్యమైంది. చైనా నూతన ప్రజాస్వామిక విప్లవానికి నాయకత్వం వహించిన మావో జెటుంగ్, లీషౌచీ, చౌఎన్‌లై, జుడే, పెంగ్‌బెన్ ఆ తరువాత తరం నాయకుడు డెంగ్ జియావో పెంగ్‌ల మధ్య పార్టీ విధానాలపైన, సోషలిజం పరివర్తన దశలపైన తీవ్ర భేదాభిప్రాయాలు వ్యక్తమయ్యాయి. 1949-56 ప్రణాళికాబద్ధ ఆర్థిక విధానం, ఆ తరువాత ప్రజా కమ్యూన్లు, గొప్ప ముందంజ, సాంస్కృతిక విప్లవ కార్యక్రమాలు వివిధ దశలలో అమలులోకి వచ్చాయి.

చరిత్రను ఒకసారి వెనుతిరిగి పరిశీలిస్తే ప్రపంచ సోషలిజంలో, చైనాలో సోషలిజం నిర్మాణంలో అపూర్వ విజయాలు సిద్ధించాయి. విషాదకర పరిణామాలు సంఘటిల్లాయి. సిద్ధాంత విభేదాలు బాహాటంగా బద్ధలయ్యాయి. అనేక కమ్యూనిస్టు పార్టీలలో చీలికలు సంభవించాయి. విప్లవోద్యమాల చరిత్ర ఎక్కడా పూలబాటగా సాగలేదు. చారిత్రక అనుభవాల నుండి గుణపాఠాలు తీసుకోవాలి.

కమ్యూనిస్టు పార్టీల నిర్మాణంలో కూడా చారిత్రక దశలు వున్నాయి. కానీ దాని మౌలిక లక్షణం ఒకటే. విప్లవాలను నడిపిన కమ్యూనిస్టు పార్టీలలో జాతి జీవనాన్ని దేశభవిష్యత్తును తీర్చిదిద్దిన కమ్యూనిస్టు పార్టీలలో సైతం కొన్ని దశలలో పెడధోరణులు ముఖ్యంగా బ్యూరాక్రసీ తలెత్తిన అనుభవాలు వున్నాయి. ఇది ముదిరిన దశలలో ఈ దేశాలలో బ్యూరాక్రటిక్ సోషలిజం, బ్యాక్‌వర్డ్ కమ్యూనిజంలో ఉబికివచ్చాయి.

'వాస్తవాల నుండి సత్యాన్వేషణ,' 'బంధనాల నుండి ఆలోచనా విముక్తి' అనే సూత్రీకరణలతో డెంగ్ జియావో పెంగ్ చైనాలో సోషలిస్టు ఆధునికీకరణకు శ్రీకారం చుట్టారు. 1970వ దశకంలో ప్రపంచంలో అనేక ముఖ్యపరిణామాలు జరిగాయి. సోవియట్ సోషలిస్టు వ్యవస్థ పురోగతిలో ప్రతిష్టంభన ఏర్పడింది. బ్రిటన్, అమెరికా దేశాలలో లియో లిబరల్ ఆర్థిక విధానాలు ఆచరణలోకి వచ్చాయి. ప్రపంచ కాపిటలిజం ఎదురుదాడి ప్రారంభించింది. 1970 దశకం చివరిలో చైనాలో డెంగ్ సోషలిస్టు మార్కెట్ సంస్కరణల పంథాను ప్రతిపాదించారు. కమ్యూనిస్టు పార్టీ నాయకత్వాన అది అమలులోకి వచ్చింది. గత 20 సంవత్సరాల కాలంలో చైనా సంస్కరణల పంథా చరిత్రలోనే అపూర్వమైన అభివృద్ధి సాధించింది. సోషలిజం ప్రాథమిక దశలో వున్న చైనా మానవ వనరులను, ఆధునిక శాస్త్ర సాంకేతిక పరిజ్ఞానాన్ని విదేశీ పెట్టుబడిని సమీకరించింది. తొలిదశలో వ్యవసాయ సంస్కరణలకు ప్రాధాన్యతనిచ్చింది. తరువాత దశలో తీరప్రాంతంలో పారిశ్రామికీకరణకు పూనుకొంది. ఇప్పుడు అన్ని ప్రాంతాలలో సమగ్రాభివృద్ధికి దీక్ష పూనింది. సోషలిజం ప్రాథమికతత వ్యూహ నిర్మాత డెంగ్ జియావో పెంగ్ సోషలిస్టు మార్కెట్ సిద్ధాంతం చైనా రూపురేఖలనే మార్చివేసింది. డెంగ్ సిద్ధాంతాన్ని కమ్యూనిస్టుపార్టీ నిబంధనావళిలో పొందుపరిచారు. మార్క్సిజం - లెనినిజం, మావో ఆలోచన, డెంగ్ సిద్ధాంతం మార్గదర్శకత్వంలో కమ్యూనిస్టు పార్టీ చైనా దేశం గొప్ప శక్తిగా అవతరించాయి.

గత రెండు సంవత్సరాలుగా చైనా కమ్యూనిస్టు పార్టీలో అన్ని స్థాయిలలోనూ రెండు ముఖ్యమైన అంశాలపై చర్చలు సాగుతున్నాయి. ఒకటి 21వ శతాబ్దంలో మొదటి 20 సంవత్సరాలు కీలకమైనవి. ఆనాటి సోషలిజం సమగ్రాభివృద్ధిని సాధించాలి. ఆర్థిక, సాంస్కృతిక, ప్రజాస్వామ్యరంగాలలో యిది పూర్తిగా ప్రతిబింబించాలి. రెండు అత్యంత ప్రాధాన్యతగల ఈ లక్ష్యాన్ని సాధించేందుకు యావత్ పార్టీని, యావన్మంది చైనా ప్రజలను సమీకరించాలి. దానికి పార్టీ నిర్మాణాన్ని విస్తరింపజేయాలి. అభివృద్ధిపరచాలి.

పార్టీ సమున్నత ఆశయం, అంతిమ లక్ష్యం కమ్యూనిజంను సాధించేందుకు ప్రాతిపదికగా ఈ కర్తవ్యాలను పరిపూర్తి చేసేందుకు చైనా కమ్యూనిస్టుపార్టీ 16వ మహాసభ నూతన శతాబ్దంలో ఒక రాజకీయ ప్రకటనను, కార్యాచరణతో కూడిన ఒక ప్రోగ్రాంను ఆమోదించింది.

సహజంగానే నూతన భావనలపై చైనాలో సాగుతున్న చర్చ, యావత్ ప్రపంచ దృష్టిని ఆకర్షించింది. వ్యాఖ్యానాలు భిన్నంగా వుంటాయనే విషయంలో ఆశ్చర్యమేమీలేదు. 16వ మహాసభకు గల చారిత్రక ప్రాధాన్యత దృష్ట్యా రెండు మూడు వ్యాఖ్యానాలను పేర్కొనవలసివుంది. గత ఆగస్టు మాసంలో జపాన్ కమ్యూనిస్టుపార్టీ అధ్యక్షుడు ఫువాటెట్ సుజో చైనా పర్యటన సందర్భంగా "లెనిన్-మార్కెట్ ఎకానమి" అనే అంశంపై చైనా సామాజిక శాస్త్రాల అకాడమీలో ప్రసంగిస్తూ యిలా అన్నారు.

"చైనా, వియత్నాంలలో మార్కెట్ ఎకానమీ ద్వారా సోషలిజంను అన్వేషిస్తున్న మార్గం, ప్రపంచంలో ఏ దేశం తుదికంటా అనుసరించలేదు, గతంలో సోవియట్ యూనియన్‌లో మార్కెట్ ఎకానమీ ద్వారా సోషలిజం విధానాన్ని లెనిన్ అనంతరం నాయకత్వం విడనాడింది"... 21వ శతాబ్దంలో ఇది పెద్ద సవాల్ అని ఆయన అన్నారు. ఇందులో ఇమిడివున్న సిద్ధాంత సమస్యలను అధ్యయనం చేయవలసివుంది.

దక్షిణాఫ్రికా కమ్యూనిస్టుపార్టీ ప్రధాన కార్యదర్శి బ్లేడ్, జియాండే చైనా పార్టీకి పంపిన అభినందన సందేశంలో దాని ప్రాధాన్యత యిలా వివరించారు.

ఇది చారిత్రాత్మక మహాసభ. చైనా ప్రజలకే గాక, ప్రపంచ వ్యాపితంగా కమ్యూనిస్టులు, సోషలిస్టులు ఇతర ప్రగతిశీల శక్తులకు కూడా ఇది ప్రాధాన్యత కలిగినది. సోషలిజం పంథాను బలపరచే తీర్మానాలు, నిర్ణయాలు మహాసభ తీసుకుంటుందనే విశ్వాసం వుంది. నియోలిబరలిజం, కాపిటలిజం నిరంకుశ అఖండ భావం చుట్టూ ఒక అగ్రరాజ్య ప్రయోజనాలకొరకు ప్రపంచాన్ని శాసించే అమెరికా సామ్రాజ్యవాద దురాక్రమణ పెరుగుతున్న పూర్వరంగంలో చైనా పార్టీ 16వ మహాసభ జరుగుతున్నది."

చైనా లక్షణాలతో కూడిన సోషలిజంను నిర్మించటంలో, కమ్యూనిస్టు పాత్రను ఇనుమడింపజేయడంలో జియాంగ్ జెమిన్ ప్రతిపాదించిన "మూడు ప్రాతినిధ్యాల"

భావన చైనా సమాజంలో గొప్ప ప్రేరణను కలిగించింది. దానిని మార్గదర్శక భావజాలంగా పార్టీ నిబంధనావళిలో పొందుపరిచారు.

21వ శతాబ్దంలో కమ్యూనిస్టుపార్టీని, దేశాన్ని నడిపించే సమర్థవంతమైన యువ నాయకత్వాన్ని మహాసభ ఎన్నుకొంది. నాయకత్వంలో మార్పులు ప్రజాస్వామ్య యుతంగా, హుందాగా, మృదువుగా జరిగాయి.

యావత్ పార్టీ కమ్యూనిజంలో, సోషలిజంలో విశ్వాసాన్ని ప్రకటించింది. ప్రభుత్వరంగం ఆధిపత్యంగల ఆర్థికవ్యవస్థను బలపరచింది.

పనికి తగిన ప్రతిఫలం, పంపిణీవ్యవస్థ ఆధిపత్యం పరిరక్షించబడుతుంది.

కమ్యూనిస్టుపార్టీ వర్గ పునాదిని, ప్రజా పునాదిని విస్తృతపరచటంలో భాగంగా, పార్టీ కార్యక్రమాన్ని నిబంధనావళిని అంగీకరించి అమలు పరచటానికి సిద్ధపడిన కార్మికుడు, రైతు, సైనికుడు, మేధావి ఎవరైనా 18 సంవత్సరాలు వయసుగలవారు పార్టీ సభ్యులకు అర్హులుగా పార్టీ ప్రకటించింది.

ది ఇంటర్నేషనల్ గేయంతో మహాసభ ముగిసింది. ప్రపంచంలోనే అతి పెద్ద కమ్యూనిస్టుపార్టీ, 21వ శతాబ్దంలో సోషలిజంను నిర్మిస్తున్న పార్టీనిర్ణయాలు ప్రపంచంలో ముఖ్యంగా భారతదేశంలో కమ్యూనిస్టు ఉద్యమశ్రేణులకు గొప్ప ఉత్తేజాన్ని కలిగిస్తాయనడంలో సందేహంలేదు.

*(2002 నవంబరు 16 - విశాలాంధ్ర సంపాదకీయం)*



## అనుబంధం

# చైనా పరివర్తన దిశ కాపిటలిజం వైపు కాదు

### ❖ షాం ఫై గోష్టిలో మేథావుల అభిప్రాయాలు

మూడు దశాబ్దాల క్రితం పశ్చిమ దేశాల ఆర్థికవేత్తలలో ఏ ఒక్కరూ చైనా ప్రైవేట్ అభివృద్ధి స్థాయి ఇంత అద్భుతంగా వుంటుందని ఊహించలేదు. చైనా ఆర్థికవ్యవస్థ పెరుగుదల రేటు గత 25 సంవత్సరాలకాలంలో ప్రపంచంలోనే మొదటిస్థానంలో వుండటం విశేషం.

పశ్చిమదేశాల ప్రామాణిక అర్థశాస్త్ర గ్రంథాలలో ఇటువంటి పురోగతికి వారు పేర్కొనే ప్రాతిపదికలు - మార్కెట్ వ్యవస్థ, ప్రైవేట్ ఆస్థి హక్కు చట్టబద్ధపాలన, ఆనాడు చైనాలో లేవు.

2003వ సంవత్సరంలో సార్స్‌లాంటి భయంకర వ్యాధి చైనాలో వ్యాపించి నప్పటికీ ఆర్థిక పురోగతి మందగించలేదు.

చైనాలో అతి పెద్ద నగరమైన షాంఘైలో చైనా అద్భుతాన్ని చర్చించేందుకు ప్రముఖ ఆర్థిక వేత్తలు, రాజకీయ శాస్త్రవేత్తలు, న్యాయనిపుణులతో ఒక గోష్టి జరిగింది.

చైనా ఆర్థిక వ్యవస్థను "మారుతున్న సోషలిస్టు ఆర్థిక వ్యవస్థ"గా పశ్చిమదేశాలలో అత్యధిక ఆర్థికవేత్తలు చిత్రీకరిస్తున్నారు. ఈ నిర్వచనాన్ని చైనా పండితులు ప్రశ్నిస్తున్నారు. షాంఘైకి చెందిన పుడాన్ విశ్వవిద్యాలయం ప్రొఫెసర్ షి జెంగ్‌ఫూ అభిప్రాయంలో చైనాలో నేడు రూపొందుతున్నది బహుశా ఒక సామాజిక ఆర్థిక వ్యవస్థ నుండి మరొక సామాజిక ఆర్థిక వ్యవస్థకు మార్పు కాదు; లేదా పశ్చిమదేశాలు అభిప్రాయపడుతున్నట్టుగా కాపిటలిజానికి "పరివర్తన" కాదు. కాని అది ఒక "తెలియని ప్రపంచానికి పరిణామం."

"చైనా సొంత ఆర్థిక వ్యవస్థ రూపకల్పనకు ఇది ఒక కొత్త శకాన్ని ఆవిష్కరించే అవకాశాన్ని ఈ పరిస్థితి కల్పిస్తున్నది" అని ప్రొఫెసర్ షి అంటున్నాడు.

ప్రొఫెసర్ షి అభిప్రాయంతో సీనియర్ ఆర్థిక శాస్త్రవేత్తలు ఏకీభవిస్తున్నారు. విశ్వవిద్యాలయంలో జరిగిన ఈ గోష్టి యొక్క చర్చనీయాంశం "నూతన రాజకీయాలు, ఆర్థిక వ్యవస్థకు సాగుతున్న యాత్ర."

1979 తరువాత చైనా ఆర్థిక వ్యవస్థలో సమూలమైన మార్పులు చోటుచేసుకున్నాయి. ప్రత్యామ్నాయాలుగా బహు ఆర్థిక నిర్మాణ చక్రాలు వున్నాయి. పాత సోవియట్ యూనియన్ ఆర్థిక వ్యవస్థ ఒక నమూనా. పశ్చిమదేశాల నియోక్లాసికల్ ఆర్థిక వ్యవస్థ మరొక నమూనా. ఆస్తిహక్కులపై ఆధారపడిన నూతన సామాజిక ఆర్థిక చక్రం ఇంకో నమూనా.

కాని చైనాలో వినూత్న ఆర్థిక పరిణామాన్ని విశ్లేషణ చేసేందుకు ఈ కేటగిరీలు సరిపోవటంలేదు.

పశ్చిమదేశాల ఆర్థిక సిద్ధాంతాల ప్రకారం చైనాలాంటి అతి పెద్ద జనాభా కలిగిన దేశం, ఆర్థిక అద్భుతాన్ని సాధించే అవకాశంలేదు. కాని అట్టి అద్భుతాన్ని మనం సాధించామని బీజింగ్ విశ్వవిద్యాలయం ప్రొఫెసర్ ఛెన్‌పిన్ అభిప్రాయపడ్డారు.

చైనా అర్థిక పెరుగుదలకు కారణభూతమైన చోదకశక్తులను పరిశీలిస్తే అనేక అంశాలలో పశ్చిమ దేశాల క్లాసికల్ ఆర్థికవేత్తలు అవసరమని భావించిన వాటికి విరుద్ధంగా కనిపిస్తున్నాయి. ఉదాహరణకు చైనాలో ఆస్తిహక్కుల సంస్కరణలు ప్రవేశపెట్టకముందే ఒక పోటీ వ్యవస్థ అవతరించింది. కొన్ని ప్రాంతాలు శరవేగంతో అభివృద్ధి చెందాయి. అక్కడ పరిస్థితులు అనుకూలంగా వున్నాయి. చైనా అనుభవాన్ని పరిశీలిస్తే పోటీ వ్యవస్థ పెరుగుదల, భిన్న యాజమాన్యాల ఆర్థిక పరిణామం రెండూసాగాయి. భిన్న యాజమాన్యాల మధ్య సహజీవనం వున్నది. ఇది పశ్చిమదేశాల ఆర్థిక పెరుగుదల నమూనాకు భిన్నమైనది. ప్రకృతి వనరులను వినియోగించటం, మానవ వనరులను పొదుపు చేయటంలో ఈ తేడా కనిపిస్తున్నది.

ప్రసిద్ధ ఆర్థికవేత్త వాంగ్ డింగ్ డింగ్ తన ప్రసంగంలో మరొక అంశాన్ని చర్చించారు. పశ్చిమదేశాల ఆర్థికవేత్తలు ప్రధానంగా చిన్న సమస్యలను పరిశీలించటంపై దృష్టిని కేంద్రీకరిస్తారు. చైనా ఆర్థికవేత్తలు వ్యవస్థాగత మార్పులను ఎదుర్కొంటున్నారు. ఇవి ఆర్థిక సిద్ధాంతాలతో సహా చైనా సామాజిక శాస్త్రాల అభివృద్ధికి ఒక పునాదిని వేస్తున్నాయి.

మరో ఆర్థికవేత్త యాహో యాంగ్ వ్యాఖ్యానిస్తూ చైనా ఆర్థిక పెరుగుదల, చాలా వరకు, వ్యవస్థాగత సంస్కరణల నుండి ఉత్పన్నమైన శక్తులపై ఆధారపడి వున్నది అని అన్నారు.

చైనా ఆర్థిక వ్యవస్థలో మూడు అంశాల యొక్క పాత్రను ప్రొఫెసర్ షి పేర్కొన్నారు. (1) ప్రభుత్వ యాజమాన్యంతో సహా బహుళ యాజమాన్యాల వ్యవస్థ. (2) ప్రైవేటీకరణకు ముందుగానే మధ్యతరగతి అవతరణ. ఆ క్రమంలో సామాజిక సంపద పంపిణీ నమూనా, (3) స్థానిక ప్రభుత్వాలు పశ్చిమదేశాలలోలాగా రాత్రి కాపలాదారుగా కాకుండా నిజమైన పరిపాలకులుగా వ్యవహరించటం.

జర్మనీ ఆధ్వర్యంలో నడుస్తున్న అధ్యయన సంస్థకు చెందిన ప్రొఫెసర్ కు జియువాన్ ఇలా వ్యాఖ్యానించారు. "పశ్చిమ దేశాల అర్థశాస్త్ర పరిశోధనలను చైనా కాపీ చేయటంలేదు. లేదా పశ్చిమదేశాల ఆర్థికాభివృద్ధి నమూనాలను కాపీ చేయటం

చైనా పరిశోధన యొక్క లక్ష్యంకాదు. అమెరికా ఆర్థికవేత్తల వలే మేం కూడా సరికొత్త సమస్యలను ఎదుర్కొంటున్నాం.

చైనా సొంత ఆర్థికాభివృద్ధికి తగిన ఒక ఆర్థిక వ్యవస్థను నిర్మించాలనేది చైనా ఆర్థికవేత్తల ఏకాభిప్రాయం. ఇప్పటికికొన్ని ఆవిష్కరణలుమాత్రమే జరిగాయి. పశ్చిమదేశాల ఆర్థిక నమూనాలను విశ్లేషించి, విమర్శించే క్రమంలో కొత్త ఆవిష్కరణలు కొన్ని జరిగాయి. జి జియాంగ్ విశ్వవిద్యాలయానికి చెందిన ప్రొఫెసర్ జిన్ చువాన్ ఇలా అంటున్నాడు. "చైనా ఆర్థిక పరిశోధన వస్తువు కొత్తది, కాని పరిశోధనా పద్ధతులు పాతవే." బ్రిటన్‌కు చెందిన రాయల్ ఇన్‌స్టిట్యూట్‌లో ప్రొపెసర్ స్టీఫెన్ గ్రీన్ ఇలా అభిప్రాయపడుతున్నారు. "ఫలితం ఎలా వున్నప్పటికీ తమ ఆర్థికాభివృద్ధి నమూనాలో చైనీయులకు పూర్తి విశ్వాసం వుంది.

